'వైష్ణవ విల్లు విరిగింది.
మైథిలి గుండె ఝల్లుమంది.
సిరి హరిని వరించింది.

మిథిలాధిపుడి సభలోనే దగ్గరగా ఉన్న బ్రహ్మర్షి విశ్వామిత్రుడికి అది విజయభేరిగా వినిపించింది. 'ప్ర - కృత యుగధర్మ ప్రవర్తనానికి నాందీ ప్రస్తావన చేశావా ప్రభూ' అనుకున్నాడాయన.

'దశకంఠ సంహార కాండలో పతాక సన్నివేశం ఆరంభమైంది.' అనుకుని ఆనందించారు దేవతలు.

'మా అన్న' అనుకున్నాడు లక్ష్మణుడు.

'నా ప్రతిజ్ఞ చెల్లింది. భగవంతుడే నాకు అల్లుడౌతున్నాడు' అనుకున్నాడు రాజర్షి జనకుడు తృప్తిగా, సగర్వంగా.

* * *

ముళ్లపూడి వెంకటరమణ: జననం - 1932 లో. విద్య-వ్యాసంగం, వ్యావృత్తి-అన్నీ మద్రాసులోనే. పత్రికా రచనతో ప్రారంభించి, తర్వాత సినిమా రచన చేపట్టారు. కథానికా రచనలో, ముఖ్యంగా హాస్యవ్యంగ్య రచనల్లో ఫోడిమి గడించుకున్నారు. సీరియస్ కథలూ సీరియస్‌గా రాయగలరని 'సీతా కల్యాణం' రుజువు చేస్తుంది. ఇవి, మరి నాలుగు కథలుచేర్చి, మలిముద్రణ వేస్తున్న ముళ్లపూడి వెంకటరమణ కథలే. వీరు కొత్త మాటల్ని చక్కగా కూరుస్తారు, పాతమాటల్ని బాగా విరుస్తారు. ఇతర రచనలు: గిరీశం లెక్చర్లు, కథానాయకుడి కథ, రాజకీయ బేతాళ పంచవింశతిక, బుడుగు, జనతా ఎక్స్‌ప్రెస్, ఋణానందలహరి, ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ, రాధాగోపాలం, విక్రమార్కుడి మార్కు సింహాసనం, వేట. ఈ పోకెట్ బుక్ సీరీస్‌లో, వీరి సాక్షి, బుద్ధిమంతుడు అనే ండు సినిమా స్క్రిప్టులు ఇదివరలో వెలువడ్డాయి.






180

ఎం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం మద్రాసు
సికింద్రాబాద్





# సీతాకల్యాణం

ముళ్ళపూడి వెంకటరమణ

Seetha Kalyanam & Other Stories

by
Mullapudi Venkata Ramana

Publishers
M. SESHACHALAM & CO

First Edition :
November, 1971

Cover design :
Bapu

Printers :
Sri Kala Printers,
Madras-33.

Distributors:
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
Rashtrapathi Road, Secunderabad.

Rs. 2-50




180

# ముళ్ళపూడి మిక్స్చర్

ముళ్లపూడి హాస్యరచయిత అనేవారూ, సీరియస్ రైటర్ అనుకునేవారూ - ఉభయవర్గాలూ సంతృప్తిచెందడానికి వీలుగా సమకూర్చిన కథా సంకలనం ఇది. (ఈ పుస్తకంలో ఆయన రాసిన 'లైట్ స్టఫ్', 'సీరియస్ స్టఫ్', 'సీరియోకామిక్ స్టఫ్' కూడా ఉన్నాయి.)

ఉదాత్తస్థాయిని ఉల్లేఖించిన ఉదాత్తమైన సీతాకల్యాణ వృత్తాంతం, ఏక'లవ్య'డైన యువకుడి ఉదంతం, 'సెరిబ్రల్ సినేమియా'లో ఒక రకం జబ్బు 'సినేరియాటిస్' అభివర్ణన. మనిషినీ-మనిషిలో కవినీ ఎదురెదురుచేసి మనిషి మనఃప్రవృత్తిని బయటపెడుతూ పరచుకున్న 'ఛాయలు', 'జలప్రళయ'మనే అన్యాపదేశ కథ - ఈ సంకలనానికి వైవిధ్యం చేకూర్చగల రచనలు.

"ఇందులో కథలన్నీ కూడబలుక్కొని కలిసికట్టుగాగాని, విడివిడిగా గాని రచయితకి తెలీకుండా మీ దగ్గరికి గుట్టుగా వచ్చి, ఇందులో దేశానికి సందేశాలున్నాయి తెలుసా? అని చెప్పి, అంతటితో ఊరుకోక అవేమిటోకూడా వెల్లడి చేసిన ట్టయినయిస్తే, ఇంకోసారి నవ్వేసి, అలాగేలే అనండి. వాటి మాటమటుకు నమ్మకండి," అని వెంకటరమణ హెచ్చరిస్తున్నారు.

"మీరు సరదాగా చదువుకుని. ఎవరైనా ఎరువడగడానికి వీల్లేకుండా సరదాగా దాచేసుకుని, సరదాగ మళ్ళీ మీరే చదుక్కోవడానికి ఇది పనికొస్తుంది" అని సలహా చెబుతున్నారు.

సునిశితమైన చమత్కారంతో సున్నితమైన హాస్యాన్ని మేళవించే ఈ 'ముళ్ళపూడి మిక్స్చర్' పాఠకులకి ఆస్వాద్యం కాగలదని ఆశిస్తున్నాము.

ప్రకాశకులు

ఇదీ వరస


| | | | |
|---|---|---|---|
| 1. | సీతా కల్యాణం | .. | 7 |
| 2. | సెరిబ్రల్ సినేమియా | . | 21 |
| 3. | లోకయాత్ర | .. | 49 |
| 4. | తాంబూలా లిచ్చేశారు | | 56 |
| 5. | వరలక్ష్మి వ్రతం | . | 69 |
| 6. | ఛాయలు | . | 78 |
| 7. | ఏకలవ్యుడు | | 93 |
| 8. | ఘాషణం వైరాగ్యం | . | 119 |
| 9. | జలప్రళయం | ... | 125 |
| 10. | సాక్షి | .. | 130 |

# 1

# సీతా కల్యాణం

త్ర్యంబకుని విల్లు విరిగింది.
మైథిలి గుండె ఝల్లుమంది.
సిరి హరిని వరించింది

* * *

పర్జన్య గర్జనవంటి ఆ ఫెళఫెళార్భటికి సమస్త చేతనాప్రపంచమూ సంభ్రమ చకితమై సమ్మోహితమై పోయింది. భూధరాలు బ్రద్దలయే వేళవలె భువన భవనం దద్దరిల్లి పోయింది.

ఆ హరధనుర్భంగ ధ్వని ధర్ములకు అభయదమై, అధర్ములకు భయదమై మనోహరంగానూ, ప్రాణహరంగానూ కూడా వినిపించింది. దశ దిశాంతాలనూ సోకి ప్రతిధ్వనించింది.

దూరాన, హిమవత్పర్వతసీమలో తపోనిష్ఠలో ఉన్న భార్గవ రాముడికి అది హెచ్చరిక అయి వినిపించింది. ధర్మప్రతిష్ఠాపనలో, అధర్మక్షాత్ర సంహారకుడు భృగుకులతిలకుడి భూమికను క్షాత్ర ధర్మ సంతారకుడు రఘుకులతిలకుడు స్వీకరించే మహత్తర సన్నివేశానికి నేపథ్యగీతమై భాసించింది. భార్గవుడు ఆ ధ్వని విని ముహూర్త కాలంపాటు భ్రుకుటి ముడిచాడు సాలోచనగా

మిథిలాధిపుడి సభలోనే దగ్గరగా వున్న బ్రహ్మర్షి విశ్వామిత్రుడికి అది విజయ భేరిగా వినిపించింది. ప్రకృతయుగధర్మ ప్రవర్తనానికి నాంది ప్రస్తావన చేశావా ప్రభూ!' అనుకున్నా డాయన.

"దశకంఠ సంహార కాండలో పతాక సన్నివేశం ఆరంభమైంది" అనుకుని ఆనందించారు దేవతలు.

"మా అన్న!" అనుకున్నాడు లక్ష్మణుడు సగర్వంగా.

"నా ప్రతిజ్ఞ చెల్లింది. భగవంతుడే నాకు అల్లుడౌతున్నాడు" అనుకున్నాడు రాజర్షి జనకుడు తృప్తిగా, సగర్వంగా.

* * *

నీలమేఘ శ్యాముడు రాముడు, తాను విరచిన విల్లును సగౌరవంగా వేదిక మీద ఉంచి, గురువుకు నమస్కరించి నిలచాడు.

'కల్యాణమస్తు. (లోక) కల్యాణమస్తు' అన్నాడు గురువర్యుడు విశ్వామిత్రర్షి.

అన్న బలాన్ని తా నెరిగినా, కన్నులారా మనోహర హర ధనుర్భంగ దృశ్యాన్ని చూచి ముగ్ధుడు కాకుండా ఉండలేకపోయాడు లక్ష్మణుడు. విల్లును చేపట్ట బోవడంలో సొగసు, నిలబెట్టి దక్షిణ పాదాంగుష్ఠానికి దన్ను పెట్టి వంచి, త్రుటిలో అల్లెతాడు ఎక్కించడంలో ఒడుపు, సౌలభ్యం, బాణం ఆరోపించడంలో మెలకువ నారిని ఆకర్ణాంతం లాగబోవడంలో చూపిన అంగవిన్యాసం సమ్మోహన కరంగా తోచాయి. అవలీలామానుష విగ్రహుడుగా గోచరించాడు— 'ఈయన మా అన్నగారు' అనుకున్నాడు లక్ష్మణుడు.

శివ ధనుర్భంగ గర్జనను మించిన జయఘోషతో లక్ష్మణుడు ప్రకృతంలోకి వచ్చాడు. రఘుకులానికీ, రాముడికీ, మిథిలాపతికీ, మైథిలికీ జయాలనూ, శుభాలనూ ఆకాంక్షిస్తూ వారిని కీర్తిస్తూ అప్పుడే తెప్పరిల్లిన సభికులు చేస్తున్న జయధ్వానాలతో హర్షధ్వానాలతో దిక్కులు పిక్కటిలుతున్నాయి. శివుడి విల్లు విరచిన ఈ నల్లటివాడి ఘనతను వందిమాగధులు ఉత్సాహంగా అనర్గళంగా గానం చేస్తున్నారు. లక్ష్మణుడు సగర్వంగా సభనంతా కలయజూశాడు.

ఎదుట జనకరాజు ఉత్సాహంతో ఉప్పొంగిపోతూ 'రామా' ఇటు రా నాయనా' అన్నాడు, తాను ఒక మెట్టు దిగుతూ.

విశ్వామిత్ర సమేతుడై రఘురాముడు ఒక అడుగు ముందుకు వేసేవరకూ మరోసారి హర్షధ్వానాలు చెలరేగాయి. జరగబోతున్నదేమిటో అందరికీ తెలుసు. జరగబోతున్నది అందరికీ ఆనందకరమైనదని కూడా అందరికీ తెలుసు. మనసులో పదే పదే అనుకొంటున్న ఆ మంచి మాట, అనవలసిన మనిషి నోట రాగా చెవులారా వినాలని అంతా చంద్రుడి కోసం చాతకపక్షులలా ఎదురు చూస్తున్నారు.

జనక మహర్షి అంజలి ఘటించాడు. "పూజ్య విశ్వామిత్ర మహర్షి! మీ శిష్యుడు, నా అనుంగు మిత్రుని పుత్రుడు అయిన ఈ దశరథ రాముని పరాక్రమాన్ని కన్నులారా చూచి ఆనందించాను. అసంభవము, అసాధ్యము అనుకున్న ఈ రుద్రధనుర్భంగం మేము ఊహించనంత అద్భుతంగా జరిగింది. నాకు బహిఃప్రాణమైన సీతను వీర్యశుల్క ప్రతిఫలంగా ఇవ్వ సంకల్పించాను. ఇపుడు ఈ విధంగా దాశరథిని భర్తగా పొందుతున్న మా జానకి, విదేహ వంశానికే కీర్తి ప్రతిష్ఠలు సమకూర్చుతున్నది. ఓ మహర్షీ! ఈ పురుషోత్తముడు రామచంద్రుడికి నేను నా కుమార్తె, సుగుణాలపేటి సీతావధూటిని కన్యాదానం చేయ సంకల్పించాను" అంటూ జానకిని దగ్గరకు తీసుకుని జలకలశం అందుకోబోయాడు జనక మహారాజు

హర్షధ్వానాలతో మంగళగానాలతో సభ మార్మోగింది.

రామచంద్రుడు ఒక్కమారు విశ్వామిత్ర మహర్షి వంక చూచి వినయంగా తల వంచుకొన్నాడు.

"మా తండ్రిగారి అనుమతి లేనిదే పాణిగ్రహణం సంభావ్యం కాదు గదా" అన్నాయి రాముడి చూపులు.

"ఔనౌను ఈ ఆనందోద్వేగ సమయంలో కూడా ఎంతటి స్థిమితమయ్యా నీకు" అంది ముహూర్తకాలంపాటు సౌమిత్రి వదనంలో తొంగిచూచిన గౌరవ భావరేఖ.

'అది న్యాయమే. అవశ్యకరణీయమే' అని ఆమోదించింది గురువుగారి మనస్సు.

పరేంగితజ్ఞులయిన ప్రభువు, జనకరాజర్షికి రామహృదయం అవగతమైంది. జనక సుత సీత కూడా ఈ ధర్మాన్ని గ్రహించిందని, ఆమె చెంపలకెంపుల వెలుగులోనే అధరాగ్రాన లీలగా గోచరించి మాయమైన మందహాస రేఖను చూచి రాముడు అవలీలగా గ్రహించాడు.

సభలో హర్షధ్వానాలు స్థిమిత పడేవరకు ఈ కర్తవ్య నిదాన, నిర్ణయాలు జరిగి పోయాయి.

● ● ●

''-కావున ఓ బ్రహ్మజ్ఞాన సంపన్నుడా! ఈ శుభ వర్తమానాన్ని దశరథ మహారాజుకు అందజేసి వారిని ఆహ్వానించడానికై నా మంత్రులను అయోధ్యకు పంప సంకల్పించాను. ఇందుకు తాము అనుమతించవలెను'' అన్నాడు జనక మహారాజు.

● ●

జనకనృపతి పురోహితుడు శతానందుడు దారి చూపగా విశ్వామిత్రుడు, రామచంద్రుడు ఆ వెనుక సౌమిత్రి విడిదికి బయలు దేరారు.

ఈసారి దారి వేరు

తాము మిథిలా నగరం వచ్చిన వేళ జనకమహారాజు యాగ శాలలో వున్నాడు. ఆహూతులతో నగరం కోలాహలంగా వుంది రథాలతో వీథులన్నీ నిండివున్నాయి.

''మహర్షి మనకు ప్రశాంతమైన స్థలంలో నివాసాన్ని చూడండి'' అని రాముడు కోరాడు.

విశ్వామిత్రుడు చూపిన బసలో విడిది చేసిన వేళ, శివ ధనుస్సును చూడవచ్చిన, మరిద్దరు రాకుమారులు....

''ఆ నల్లనివాడే విల్లు విరచిన రాముడట'' అంటున్నారు ఎవరో ..

"వాళ్ళు మొత్తం నలుగు రన్నదమ్ములు ...రాముడి వెంట ఉన్న తేజోవంతుడే—"

"వందిమాగదుల స్తుతి పారాలు ఇవాళ శ్రుతి మధురంగా, అతి సహజంగా వినిపించాయి సుమీ"

"దాదాపు అతిశయోక్తులు దొరకక అవస్థ పడ్డారట. ఎంత చెప్పినా వాళ్ళకే తృప్తి లేదనుకున్నారు ఇందాక."

"విశ్వామిత్ర మహర్షి వీళ్ళని వెంట బెట్టుకు వచ్చాడు ధనుర్వేదం అంతా ఉపదేశించాడట."

"అయ్యా వందిగారూ—ఇందాక మీరు గానం చేసినపుడు రాముడి పేరుతో ప్రాస వేసిన మిగతా మూడు మాటలూ ఏమిటండీ."

'అలా వెళ్ళవయ్యా. వెళ్ళి ఆయన ఎదుట నిలబడు. మాటలు వాటంతట అవే వస్తాయి ధారాళమైన కవితాశక్తి అబ్బుతుంది."

'శతానందులవారి తల్లి అహల్యాదేవికి శాప విముక్తి ప్రసాదించిన రామ పాదాలు అవే. నమస్కరించు నాయనా! నమస్కరించు "

ఈ మాట విన్నపుడు రామ పాదాల మహిమవల్ల సంభ వించిన ఒక రమణీయ సన్నివేశం లక్ష్మణుడి మనసులో మెరసింది.

అహల్యా గౌతమ మహర్షులవద్ద సెలవు తీసుకొని, మిథిలకు ప్రయాణం కొనసాగిస్తూ ఉండగా గంగానదీ తీరాన తామంతా విశ్ర మించారు. మరునాడు ఉదయం నదిని దాటడానికి పడవ ఎక్కబోయే వేళ ఈ రామ పాదమే పేచీ తెచ్చి పెట్టింది. పడవవాడు ఒక్క నమస్కారం పెట్టి వెళ్ళిపోబోయాడు

"ఏమయ్యా గంగ దాటించవా?" అన్నారు విశ్వామిత్రులవారు.

"స్వామీ, మీ వెంట ఉన్న ఆ నల్లనాయన పాదధూళి సోకితే రాళ్ళు ఆడవాళ్ళుగా మారుతున్నట్టు విన్నాను బాబూ! నాకున్నదల్లా ఒక్కటే పడవ. ఇపుడాయన కాలు మోపగానే అది ఇంకో ఆడదిగా మారిపోతే నా గతేం కాను?—నన్ను దయ చూడండి" అన్నాడా పడవవాడు గడగడ వణకుతూ.

అందరికీ నవ్వు వచ్చింది "భయపడకయ్యా' అలాటిదేమీ జరగదులే'' అన్నాడు ఆయనగారు నెమ్మదిగా నవ్వుతూ.

''అదుగో తనలో తను నవ్వుకుంటున్నాడే.... అందగాడు. ఆయనే లక్ష్మణుడు సుమిత్రాదేవి కుమారుడు."

"అపర విష్ణువులా ఉన్న ఆ చిన్నవాడికి ఊర్మిళాదేవి నిచ్చి పెళ్ళి చేస్తేనో___"

జనవాణి విని ఆనందిస్తున్న సౌమిత్రి ఉలికిపడి, చుట్టూ చూసి తల వంచుకుని అడుగు చురుకుగా వేసి అన్నకు దగ్గరగా వెళ్ళాడు

అన్ని కక్ష్యలూ దాటి, సింహ ద్వారం సమీపించేసరికి రథం ఆయత్తం అయి ఉంది. అక్కడ రామదర్శనం కోసం వేచి ఉన్న వేలాది జనులు జయధ్వానాలు చేశారు.

రాముడు అందరికీ నమస్కరించి రథం ఎక్కాడు

దశరథమహారాజుకు జనకుడి శుభవర్తమానం అందజేయ బోయిన దూతలు మూడు పగళ్ళు హుటాహుటిగా ప్రయాణం చేసి అయోధ్య చేరుకొన్నారు. చేరిన వెంటనే రాజదర్శనం సంపాదించారు

తేజస్వి అయిన చక్రవర్తిని చూచి అంజలి ఘటించి తమను పరిచయం చేసుకొన్నారు. ఆ స్నేహమయుడి ప్రియవాక్కు విని ధైర్యం తెచ్చుకొని మాట్లాడారు. రామలక్ష్మణుల క్షేమం తెలిపారు. శివచాప ఖండనోదంతాన్ని విన్నవించారు. జనకమహర్షి హృదయాన్ని, కల్యాణ సంకల్పాన్ని నివేదించారు.

దశరథమహారాజు సంతోషంతో ఉప్పొంగిపోయాడు. తన ఉపాధ్యాయులు వసిష్ఠవామదేవుల ఆమోదంతో. మర్నాడే మిథిలకు ప్రయాణం కావాలని నిశ్చయించాడు.

ధనకనక వస్తువాహనాలతో ప్రయాణానికి సర్వం సిద్ధమైంది. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, దీర్ఘాయుష్మంతుడు మార్కండేయుడు, కాత్యాయనుడు మొదలగువారు ముందు నడువగా దశరథమహారాజు భరతశత్రుఘ్నులతో, భార్యలతో ఇతర బంధు

మిత్రులతో నాలుగు పగళ్ళు ప్రయాణం చేసి మిథిలాపురి చేరు కొన్నారు.

ఈ సప్తాహాలూ రామలక్ష్మణులు పుణ్యకథా శ్రవణంతో శ్రుతకథా పునశ్చరణంతో కాలక్షేపం చేశారు. విశ్వామిత్రుని వెంట నిత్యమూ యాగశాలకు వెళ్ళి అక్కడికి వచ్చిన ఋషులను దర్శించి సద్గోష్ఠి నెరపారు. విడిదిలో ఉన్నపుడు, సిద్ధాశ్రమం నుండి తాము మిథిలకు సాగించిన ప్రయాణంలో రాత్రివేళ విశ్వామిత్ర మహర్షి చెప్పిన గాథలను—కుశవంశీయులకథ, గంగావతరణం, కుమార సంభవం, సాగరచరితం. సముద్రమథనం మొదలైనవాటిని చర్చించి లోకవృత్తాన్ని ఆకళింపు చేసుకొన్నారు.

దానవులను సంహరించి సాధుజనులను సంరక్షించడానికి శ్రీమహావిష్ణువు ఎత్తిన అవతారాల కథలు చెప్పుకొన్నారు.

అక్కడ జనకరాజు అంతఃపురంలో కూడా ఈ ఏడు రోజులూ పుణ్యకథలే వినిపించాయి. అక్కడ పుణ్యకథా నాయకుడు ఒకడే. పురుషోత్తముడు రాముడు. చెలులూ చెల్లెళ్ళూ కూడా జానకికి ముప్పొద్దులా రామకథలే చెప్పారు. చెప్పినకొద్దీ ఊరేవి; ఊరిన కొద్దీ ఊరించేవి.

* * *

దశరథమహారాజు వస్తున్నాడన్న వార్త రాగానే జనకుడు ఉపాధ్యాయ, మంత్రి, పరివార సమేతుడై కాబోయే వియ్యంకుడు అయోధ్యా నగర చక్రవర్తికి ఎదురేగి స్వాగతం చెప్పాడు వారందరినీ యజ్ఞశాలకు తీసుకు వచ్చి మర్యాదలు చేశాడు

"ఓ రాజా! తాము మా భూమికి రావడము నా భాగ్యము వసిష్ఠాది మహర్షులంతా కూడా ఈ శుభకార్య సందర్భంగానైనా ఇటు రావడము నా సుకృత ఫలమనే తలుస్తున్నాను. ఓ రాజా! రామచంద్రుడి పరాక్రమ విభవం తామూ మేము కూడా గర్వించ వలసినది. రఘువంశము వారితో ఈ విధంగా మేము వియ్యమాడుతు న్నందువల్ల మా వంశ ప్రతిష్ఠ ఇనుమడిస్తున్నది. రేపు యాగం సమాప్తం కాగానే, వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షుల ఆశీర్వచనంతో

తమ ఆమోదంతో సీతారాముల కల్యాణం జరిపించవలెనని సంకల్పించాను" అన్నాడు జనకుడు.

దశరథుడు మహదానందహాసం చేశాడు

"రాజర్షీ! ఇపుడు దాతలు తాము. అందువల్ల దానము మీ సంకల్పం ప్రకారం ఉంటుంది తాము ఏమి యిస్తామన్నా ఎప్పుడు ఇస్తామన్నా అందుకోవడమే మావంతు" అన్నాడాయన.

ఈ ప్రియ వచనానికి జనకరాజర్షి, అక్కడి పెద్దలు అంతా ఎంతో సంతోషించారు.

ఆ రాత్రి దశరథుడు సూర్య చంద్రులవంటి పుత్రులిద్దరినీ తనవద్ద కూర్చోబెట్టుకొని, వారి వనజీవన యాత్రా విశేషాలను గుచ్చి గుచ్చి అడిగి తెలుసుకొన్నాడు. సద్గుణ నిధి రాముడు వినమ్రతతో స్వీయ ప్రతాపాన్ని ప్రస్తావించని సందర్భాలలో తండ్రి తన చిన్న కుమారుడి వంక చూచేవాడు. లక్ష్మణుడు నవ్వి, ఆయా విశేషాలను, అన్నగారి ప్రజ్ఞాప్రాభవాలను మహోత్సాహంతో వర్ణించి చెప్పేవాడు.

ఈ విధంగా ఆ రాత్రి ఉత్సాహవంతంగా గడిచిపోయింది.

*　　　*　　　*

మరునాడు యజ్ఞకాండ నిర్ణీత ప్రకారం పూర్తికాగానే, జనకుడు సాంకాశ్య నగరములో వున్న తన తమ్ముడు కుశధ్వజుడిని పిలిపించాడు. ఆయన రాగానే ఉపాధ్యాయ సమేతుడై కొలువు తీరాడు. వివాహ ముహూర్తం నిర్ణయించ నిశ్చయించి అందుకై దశరథ మహారాజునూ, వసిష్ఠ విశ్వామిత్రులనూ ఆహ్వానించ వలసిందిగా తన మంత్రి సుదామనుణ్ణి పంపించాడు.

పురోహితులూ, హితులూ, పుత్రులూ వెంటరాగా దశరథుడు జనక సదనానికి వెళ్లాడు. స్వాగతాది మర్యాదల అనంతరము ఇక్ష్వాకుల కులగురువు, దైవము అయిన వసిష్ఠ మహర్షి, ఇక్ష్వాకు వంశ సంభవాన్ని, ఆ వంశానికీ, వారేలిన నేలకూ కూడా కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చిన రాజుల రారాజుల చరిత్రను వివరించాడు.

"జనక చక్రవర్తీ! ఇక్ష్వాకు వంశీయులంతా మహా పరాక్రమ

వంతులు పరమ ధార్మికులు. నీవు వీరితో వియ్యమందటం అందరికీ హర్షం కలిగిస్తుంది. ద్యుతిమంతులు, ధృతిమంతులు అయిన మా రామలక్ష్మణులకు మీ రామలు సీత, ఊర్మిళలు అన్ని విధాలా ఈడూ జోడూ అయినవారు" అని వసిష్ఠమహర్షి చెప్పాడు.

అప్పుడు జనక రాజర్షి వసిష్ఠునికి వందనం చేసి, తన వంశ చరిత్రను విపులంగా విన్నవించాడు.

"మహర్షి! సీత దేవకన్య. శివధనుస్సును ఎక్కుపెట్టిన మహా వీరునికే ఆమెను ఇచ్చి వివాహం చేయాలన్న నా సంకల్పం నెరవేరింది. ఇపుడు తాము, నా రెండవ కుమార్తె ఊర్మిళను లక్ష్మణుడికి ఇవ్వవలెనని హితవు చెప్పారు. మీ మాటను శిరసావహించి, మనసా ఆ ప్రకారమే ఊర్మిళా లక్ష్మణులకు కూడా వివాహం చేస్తాము" అన్నాడు జనకుడు. ఆ విధంగా చెప్పి ముహూర్త నిర్ణయానికి ఉపాధ్యాయులను సంప్రతించాడు.

చిన్న కుమారుడి వంక వాత్సల్యముతో చూస్తున్న దశరథ మహారాజును చూచి "ఓ రాజా! తాము రామలక్ష్మణుల వివాహాలకు నాందీకార్యాలను జరిపించాలి. ఈ రోజు మఘా నక్షత్రము. ఎల్లుండి ఉత్తర ఫల్గునీ నక్షత్రం వివాహానికి శుభస్కరమైన వేళ" అన్నాడు జనకుడు.

వసిష్ఠుడూ, విశ్వామిత్రుడూ ఈ వ్యవధిలో పరస్పరం సంప్రదించుకొని ఒక తీర్మానానికి రావడం లక్ష్మణుడు గమనించాడు. వారికి తోచిన ఊహను అతడు ఊహించుకుని ఆనందించాడు. క్రీగంట రాముడి వంక చూచి 'నవ్వు ఎందుకు' అన్న అన్నగారి చూపు చూచి తల వంచుకొన్నాడు.

'నేనూ విశ్వామిత్రులూ ఆలోచించిన విషయం ఒకటి ఉంది" అంటున్నారు వసిష్ఠులవారు.

పరేంగితజ్ఞుడు జనకుడు తక్షణం తన తమ్ముడు కుశధ్వజుడి వంక సాభిప్రాయంగా చూచాడు.

"జనకరాజా. నీ సోదరుడు కుశధ్వజుడు వీరుడు. ధార్మికుడు ఆయన కూడా, మీతోపాటుగా రఘువంశీయులతో వియ్యమాడడం

అన్ని విధాలా సమంజసమైనది. కుశధ్వజుడి కుమార్తెలు మాండవీ శ్రుతకీర్తులు ఇద్దరూ అసమాన లావణ్యలు. రామానుజులైన భరత శత్రుఘ్నులు ఇద్దరూ పరాక్రమశాలులు. తేజోవంతులు. వీరికి అన్ని విధాలా యోగ్యులైన వరులు. వీరిని వారికి వరిస్తున్నాము. దిక్పాల కులవంటి దాశరథులు నలుగురికీ మీ అన్నదమ్ములిద్దరూ మీ మీ కుమార్తెలను ఇచ్చి వివాహంచేసి మీ రెండు వంశాలవారు బాంధవ్యం కలుపుకోవడం శుభప్రదం'' అన్నాడు వసిష్ఠుడు.

జనక మహారాజు, కుశధ్వజుడూ ఈ విషయం ఆలోచించి, వెంటనే ఆమోదించారు.

మహర్షులకు అంజలి ఘటించారు. ''మీ ఆజ్ఞ మాకు కల్యాణ ప్రదమైనది. సంతోషంగా మేము శిరసా వహిస్తున్నాము. ఎల్లుండి ఉత్తర ఫల్గునీ నక్షత్రం. ఒక్క ముహూర్తంలోనే నలుగురి వివాహాలూ జరగాలని మేము కోరుతున్నాము'' అన్నాడు.

వసిష్ఠ విశ్వామిత్రులూ శతానందాది విప్రవరులూ ఈ వాక్యాన్ని ఆమోదించారు. లోకోత్తరమైన ఈ కల్యాణ సంకల్పాన్ని శ్లాఘించారు.

* * *

జనక మహారాజు, కల్యాణవార్తను తెలుపుతూ శుభపత్రికలు నలుమూలలకూ పంపాడు దేశం నలుదిశలా ఈ వార్త ప్రకటన చేయించాడు. పౌర్ణమినాటి సముద్రంలా దేశంలో ఉత్సాహం పొంగి పరవళ్ళు తొక్కింది. వెన్నెలలా సంతోషం వెల్లివిరిసింది. రామచంద్రుడి కీర్తిలా దశదిశలా వ్యాపించింది.

అతిశయోక్తులను అతి సామాన్య పదాల స్థాయికి దించే స్థాయిలో వాడవాడలా వీధివీధులా అలంకరణలు జరిగాయి. మిథిలా నగరమే ఒక విశాలమైన వివాహ వేదికలా శోభాయమానంగా భాసించింది.

దశరథమహారాజు పుత్రుల వివాహానికి నాందీకాండనంతా శాస్త్రోక్తంగా జరిపించాడు. ఆరోగ్యవంతాలైన నాలుగు లక్షల గోవు లను తెప్పించి వాటి కొమ్ములకు బంగారు తొడుగులు వేయించాడు.

పాలు పిండుకోవడానికి కంచుపాత్రలు సమకూర్చి, వత్సాలు సహా ఆ ధేనువులను, విశేషంగా ధనాన్ని దానం చేశాడు. ఉత్తర ఫల్గునీ నక్షత్ర దివసోదయాన, విజయ ముహూర్తంలో పుత్రకళత్ర బంధు మిత్రులతో బయలుదేరి, వసిష్ఠాది మహర్షులను ముందుంచుకొని మంగళవాద్యాలతో భేరీ తూర్య నాదాలతో జయదుందుభి ధ్వానాలతో వైభవంగా జనక మహారాజు యజ్ఞవాటికకు చేరాడు. మంగళ స్నానాలాచరించి, శ్రేష్ఠ మణిభూషణాలతో అలంకరించుకొని కల్యాణ కంకణ ధారణచేసిన రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురూ తండ్రి కిరువంకలాచేరి బ్రహ్మదేవుడిని సేవిస్తున్న దిక్పాలకులవలె, విభవాన్ని ఇనుమడింప చేస్తున్న సుగుణాలవలె నిలచారు.

వసిష్ఠుడు యాగశాలలోకి వెళ్ళి, పెళ్ళికుమారులు తరలి వచ్చారనీ, దశరథమహారాజు కన్యాదాత రాకకై ఎదురు చూస్తున్నాడని జనకుని హెచ్చరిక చేశాడు.

జనక చక్రవర్తి సరసదరహాసంతో, 'ఓ పూజ్యుడా! ఇదేమి రాయబారము' అన్నాడు. "దశరథమహారాజుకు ఈ సీమలో అడ్డేమిటి? ఆయన ఒకరి ఆజ్ఞకోసం ఆగడమేమిటి! ఈ రాజ్యం ఆయనది కాదా. ఇంకా ఆలస్యమెందుకు. నా కన్యలు నలుగురూ, ఇదుగో అలంకృతలై, దీపకళికలవలె వేదికవద్ద కూర్చొని ఉన్నారు. వారిని వెంటనే తీసుకురండి" అన్నాడాయన.

అపుడు వసిష్ఠుడు దశరథమహారాజును, పెళ్ళికొడుకులను, ఋషులనూ, వివాహ వేదికవద్దకు తీసుకువచ్చాడు.

పచ్చని కొబ్బరిఆకులతో వేసిన చక్కని విశాలమైన పందిరి క్రింద శాస్త్రోక్తమైన వివాహవేదిక నిర్మించి ఉంది. గంధ పుష్పాదులతో, నవాంకురాలతో అలంకరించిన బంగారు పాలికలూ, నానా వర్ణ రంజితాలు అయిన కుంభాలూ. ధూపదీపాలు అమర్చే స్తంభాలూ, శంఖాలవంటి చిత్రవిచిత్ర రూపాలలో ఉన్న కలశాలూ, ఇంకా అర్ఘ్యజలం, అక్షతలూ, ఫలాలూ ఉంచిన రకరకాల పళ్ళెరాలూ ఆవేదిక చుట్టూ అందంగా అమర్చారు. ఇవి కాక, అక్కడ కూర్చున్న

మహాత్ములవల్ల ఆ వేదిక తేజోవంతంగానూ, చుట్టూ చేరిన వారి ఆనందోత్సాహాలతో కల్యాణ శోభాయమానంగానూ రాజిల్లింది.

జనకమహారాజు ప్రార్థన పురస్కరించుకొని వసిష్ఠుడు విశ్వామిత్ర శతానందోపాధ్యాయులను ముందుంచుకొని వివాహకాండ ఆరంభించాడు. వేదిక మధ్య అగ్నిహోత్రాన్ని ఏర్పరచాడు. శాస్త్ర విహితంగా దర్భలు పరచాడు. సమంత్రకంగా హోమం చేశాడు. అప్పుడు జనకుడు లేచి సీతవంక చూశాడు. మధుపర్కాలు ధరించి మనోజ్ఞ భూషణాలతో అలంకరించుకొన్న జానకి, వేదంలా మహా ద్వంతమైన, వెన్నెలవలె తెల్లనైన ప్రియవచనం వలె మధురమైన మందహాసం చల్లగా ప్రసరిస్తూ సాక్షాన్మహాలక్ష్మిలా గోచరించింది.

సుహాసిని సీతను జనకుడు అగ్నిహోత్రం వద్దకు తీసుకు వచ్చాడు. ఆ పైన రామచంద్రుడిని ఆహ్వానించాడు.

అక్కడ నీలమేఘ శ్యాముడు రాముడు అగ్నిహోత్ర కాంతులలో అద్భుతుడై గోచరించాడు. పురుషోత్తముడై ప్రకాశించాడు. సాక్షాత్పరాత్పరుడే నిలచాడనిపించాడు. ఆయనను కన్నతండ్రి ధశరథుడు, కన్నెనిస్తున్న జనకుడు, విద్య ప్రసాదించిన విశ్వామిత్రుడు, కులపతి వసిష్ఠుడూ అతని అనుంగు సోదరుడు లక్ష్మణుడూ కూడా ఆ నల్లని పెళ్ళికొడుకులో అద్వితీయమైన తేజాన్ని దర్శించి ముహూర్తకాలంపాటు విభ్రాంతులై కర్తవ్యజ్ఞానం కోల్పోయారు. ఏకకాలంలో అత్యంత దర్శనీయుడుగానూ, సత్యంవలె దుర్నిరీక్ష్యుడుగానూ ప్రకాశించిన లోకైక మంగళ విగ్రహుండిని చూచి, చూడలేకా గ్రహించలేకా అనుభవైక వేద్యమైన ఆనంద స్థితిని అందుకున్నారు. క్షణం తరువాత, ఈ లోకోత్తరుడి లోకకల్యాణ కార్యక్రమంలో తామే భూమికలు నిర్వహిస్తున్నారన్న తలపు రాగానే వారందకీ శరీరాలు పులకలెత్తాయి.

* * *

కమలపత్రేక్షణుడు రాముడు మధుమధుర మందహాసం చేశాడు.

ముహూర్తం మించిపోతూందని గ్రహించి జనకమహారాజు జలకలశం పైకెత్తాడు.

"ఇయం సీతా—" అన్నాడాయన సముద్ర గంభీరస్వరంతో.

కమలలోచనాలు, పద్మదళాయితాక్షివంక చూశాయి.

జనకుని సరసత్వం లక్ష్మణునికి ఆహ్లాదం కలిగించింది. "ఇదేనయ్యా సీత....నీవు సిద్ధాశ్రమంనుండి మిథిల వచ్చేదాకా, శివ ధనుర్భంగం చేసిన ముహూర్తంనుండి ఈ శుభ ఘడియదాకా, ఎప్పుడు చూస్తానని ఆరాటపడుతున్న సీత యిదేనయ్యా" అంటున్నది జనకుడి వాక్యం.

"—మమ సుతా" అన్నాడు కన్యాదాత.

"కన్య ఘనతకు ఆ ఒక్క ముక్క చాలుగదా—జనకసుత కావడం" అనుకున్నారు సభ్యులంతా.

"లక్ష్మీదేవిని శ్రీ మహావిష్ణువుకు ఇవ్వగలుగుతున్న భాగ్యశాలి" అనుకున్నారు.

జ్ఞాని జనకుడుమాత్రం తన భూమిక గురించి దురభిప్రాయ పడలేదు. "మా లక్ష్మి సాక్షాత్తూ మహాలక్ష్మి. ఈమెను నీకు ఒకరివ్వడం ఏమిటి. నీవే గ్రహించాలి" అని ధ్వనించిం దాయన ఉచ్చరించిన 'పాణీగృహ్ణీష్వ పాణినా' అన్న వాక్యార్థం; అందరి హృదయాలలోనూ.

ఆపైన, మామగారుగా ఒప్పించి, దీవించాడు. "నాయనా రామా! నా కూతురు నీకిక సహధర్మచారిణి. నీవెంట నీ నీడలా ఉంటుంది. ఈమె చేతిని పట్టుకో. నీకు శుభం అవుతుంది" అంటూ సమంత్రకంగా శ్రీరాముడి చేతిలో నీళ్ళు వదిలాడు జనకుడు.

మంగళవాద్యాలు మిన్నంటాయి; మింట దేవదుందుభులు మ్రోగాయి. పందిరి శుభాక్షతలు కురిసింది. ఆకాశం దివ్యాక్షతలను కురిసింది. దివీ, భువీ కూడా ఒకటై దంపతులను దీవించాయి.

లోకమంతా హర్షపులకాంకితం అయింది.

* * *

జనకుడు వెంటనే లక్ష్మణుడిని పిలిచాడు. "నాయనా లక్ష్మణా! నీకు శుభమవుతుంది. వెంటనేవచ్చి, ఇదిగో మా ఊర్మిళ చేతిని చేబట్టు....ఓ రఘునందనా! భరతుడా! నీవుమాండవి కరాన్ని పరిగ్రహించు. మహాబాహూ! శత్రుఘ్నా నీవు శ్రుతకీర్తి హస్తాన్ని పట్టుకో. ఓ రఘుకుల దీపకులారా! మీరంతా ఇపుడు అగ్ని సాక్షిగా గ్రహిస్తున్న ఈ మీ భార్యలతో సౌమ్యులై ధర్మపథం తప్పక చరించవలసింది" అన్నాడు.

శ్రీ రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురూ సీత ఊర్మిళ మాండవీ శ్రుతకీర్తుల చేతులు పట్టుకొని అగ్నికి, వివాహవేదికకు, చక్రవర్తి లిద్దరికీ, మహర్షులందరికీ ప్రదక్షిణం చేశారు. వారికి నమస్కరించారు. పిమ్మట వేదికపై కూర్చున్నారు. తిరిగి శాస్త్రోక్తంగా కన్యాదాన, పరిగ్రహణాదికాలు జరిగాయి. ఆ వధూవరులు చేతులు పట్టుకొని ముమ్మారు అగ్నికి ప్రదక్షిణంచేసి వందన మాచరించారు. మంగళాశీర్వచనఘోషతో, భువీ దివీ ప్రతిధ్వనించాయి. దేవతలు పూలవాన కురిపించారు. గంధర్వులు స్పృహణీయమైన మాధుర్యాన్నంతా గానంలోకి అనువదించి భువికి దించారు. అప్సరసలు ఆనందాతిశయంతో నర్తించారు.

విజయ దుందుభులు, తూర్యనాదాలు మరొకమారు దశదిశలా మారుమ్రోగాయి.

రఘురాముడు తన దక్షిణ హస్తంతో సీతావధూటి పాణి.పల్లవాన్ని మృదువుగా అదిమాడు.

ఆ పరమకల్యాణి మందహాసం సిగ్గుదొంతరలలో అందంగా కలసిపోయింది. సీతారాముల మధ్య ఆ క్షణార్ధంలో జరిగిన ఈ రహస్య మధురసరాగవృత్తం, నేటికీ వధూవర కరకమలాలలో పునఃపునరావృతం అవుతూనే ఉంది. లోకమంతటా పాణిగ్రహణ మధురక్షణాల వేళ వధూవరులంతా సీతారాముల ఈ అనురాగాన్ని ప్రస్తరిస్తూ వారిని స్మరిస్తూ తరిస్తూ ఉన్నారు.

---

# 2

# సెరిబ్రల్ సినేమియా

"స్ప్లిట్ ఐరిష్ షాట్ అన్నాడండి. విచ్చు రూపాయట. మసక వెన్నెల్లో రోడ్డుమీద మెరిపిందట. తల కుడికీ ఎడమకీ 'పాన్' చేశాడట. లాంగ్ షాట్‌లో స్తబ్ధంగా ఉన్న ప్రకృతి. వణికే చేతుల్తో ముందుకు వంగాడట ..." అన్నాడు శంకరం.

ఆభివర్ణన వింటున్న ఇంటాయన విశ్వనాథంగారు విరగబడి నవ్వాడు. "వణికే చేతుల్తో వంగడం ఏమిటోయ్" అన్నాడు.

"మీ రిలా హేళనచేయడం భావ్యం కాదండి. జ్వరంతో ఉన్నాడు కాబట్టి, మీకు వైద్యం తెలుసు కాబట్టి మందేమన్నా ఇస్తారని మీకు మనవిచేశాను" అన్నాడు శంకరం తాపీగా.

"పాయింటే అనుకో. కాని. నాకూ మనసు బాధగా ఉంది. అద్దేమన్నా ఇస్తాడేమోనని చాలా రోజుల్నించి చూ స్తున్నాను."

"ఇప్పుడు అద్దె అడిగితే నేనేం చెప్పనండి. అతనికి ఒంటి మీద స్పృహలేదాయె. అలా కలవరి స్తున్నాడాయె."

"అది కూడా పాయింటే. అయినా మందివ్వడానికి, బోర్డు కట్టినా నేను వైద్యం చెయ్యటం లేదండి. అయినా కాకపోయినా సెరిబ్రల్ సినేమియాకి మందులేదు. ఈ కేసులు నాకేం కొత్తకాదు. ఈ గదిలో అద్దెకున్న 'సినీమానియా' లలో ఇతను నాలుగోవాడు.

రేపు జ్వరం తగ్గగానే గది కాళీచేసి వెళ్ళమనండి. అద్దె కట్టక్కర్లేదు.''
అంటూ విశ్వనాథంగారు లోపలికి వెళ్ళిపోయారు.

''ఏవండోయ్, మాట.'' అన్నాడు శంకరం.

''ఏవండీ''

''ఇతను మీ యింట్లో ఎన్నాళ్ళనించి అద్దె కుంటున్నాడు?''

''నాలుగు నెలలు. రెణ్ణెల్ల అద్దె బకాయి.''

''మీ రన్నట్టు, పాయింటే. అయితే ఇంకో పాయింటు కూడా వినండి. ఇతను నాకు మావయ్యకొడుకేమీ కాడు. ప్రాణ మిత్రుడూ కాడు. ఒకరోజు పరిచయం అంతే,'' అన్నాడు శంకరం.

''అయితే ఏమంటారు?''

''ఏంలేదు. అంతే.'' అంటూ గదిలో గ్లాసు తీసుకుని కాఫీ తేవడానికి వెళ్ళిపోయాడు శంకరం.

'పాయింటేస్మీ'' అనుకున్నాడు ఇంటాయన విశ్వనాథంగారు సాలోచనగా.

* * *

శంకరం కాఫీపట్టుకు తిరిగివచ్చేసరికి గదిలో ఆనందరావు లేడు.

ఇంటాయన ముసిముసినవ్వులు నవ్వుతూ నించున్నాడు.

''ఇప్పుడే, రెండునిమిషా లైందండి వెళ్ళి'' అన్నాడాయన.

''ఎలా వెళ్ళాడు జ్వరంతో'' అన్నాడు శంకరం విస్తుపోయి.

''ఎలా వెళ్ళాడు? డిస్టెంట్ లాంగ్ షాట్‌లో కాబోలు.''

శంకరం మొహం ముడుచుకున్నాడు.

''అతనిగురించి మీరు నాతో పరాచికాలాడటం బాగుండ లేదండి. జ్వరంతో తూలుతూవస్తుంటే చూచి, ఇక్కడ దిగబెట్ట డానికి వచ్చాను అంతే.'' అన్నాడు శంకరం.

''జ్వరం ఎక్కడుందండి. అతన్ని పీడించేది సినేరియాటిస్. అంటే సెరిబ్రల్ సినేమియాలో ఒకరకం జబ్బు. ఊహుం సినేరియోలు రాసెయ్యాలని ఉబలాటం అన్నమాట. సాయంత్రమే పెద్ద 'ఛాన్సు' తప్పిపోయి షాక్ తిన్నాట్ట. అదీ సంగతి. అందుకని,

నేను కాస్త కాఫీ పట్టించి, కాసిని ఆశలు తినిపించాను. ఝూం మని లేచి, మళ్ళీ వేట కెళ్ళిపోయాడు.''

''రాత్రిపూటా!''

''లేడికి లేచిందే పరుగు, కోలుకుంటాడని నేను కాస్త ఆశ పెట్టాను. నాకు తెలిసిన ఒక సినిమా ఆయనికి రికమెండేషన్ రాసిచ్చాను. ఆ ఉత్తరం పట్టుకు ఝూం మని వెళ్ళాడు.''

''మీరు చాలా మంచివాళ్ళండి'' అన్నాడు శంకరం.

'పోయిందే... ఎటొచ్చీ మనమందరం మరిచిపోతాం ఆ సంగతి, ఆంజనేయుడు వంటివాళ్ళం'' అన్నాడు ఇంటాయన.

ఆనందరావు హుషారుమీద ఎక్కి సరాసరి స్టూడియో గేటు దాకా మూడు మైళ్లూ నిరాఘాటంగా వెళ్ళిపోయాడు. అక్కడ రాప్ మని ఆగిపోయాడు.

కబంధహస్తం వంటిది అడ్డుపడింది. ఉత్తరక్షణంలో గూర్ఖా వాడి కఠినవదనం కనబడింది, గర్జించింది.

''క్లోజప్ కట్'' అనుకున్నాడు ఆనందరావు, క్షణంలో సగంలో ఆ సన్నివేశానికి సినేరియా ఊహిస్తూ.

తన హుషారు, ఆశలూ సర్వం కట్ అయిపోయాయి.

జేబులో ఉత్తరంతీసి చూపించి, తెలుగుభాషలో సంగతి అంతా చెప్పి; 'హై' అన్నాడు చివర.

ఆనందరావు భాషావైదుష్యానికి గూర్ఖా ముగ్ధుడు కాలేదు; సరిగదా వాడిభాషలోఆజ్ఞవంటి పొడిముక్కలు రెండన్నాడు.అంతలోనే కారేదో ఎక్కణ్ణించో వచ్చింది 'హుకో' అంటూ పక్కకి నెట్టి గేటు తీసి సలాం కొట్టాడు. కారులోని తార ఆనందరావుని చూచీ చూడ నట్టుగా చూసి, నవ్వీ నవ్వనట్టుగా నవ్వుకుంది. కారు వెళ్ళిపోయింది, ఆనందరావు పేక మేడ కూలిపోయింది. అతను తొడుక్కున్న ఆశలచొక్కా పగిలి, చిరిగిపోయింది. తాను వ్రాయబోయే కథతో ఎవరో తియ్యబోయే చిత్రంలో ఆ తారే హీరోయిన్ కావాలని కోరు కుంటున్నాడు. పదిరోజులు ఆవిడ ఇంటి చుట్టూ తిరిగి, ఒకరోజు ఎలాగో దర్శనం సంపాదించి ఆముక్క ఆవిడతోనే చెప్పి వచ్చాడు.

నవ్వింది.

'చాలా అందంగా' అనుకున్నాడు ఆనందరావు. పూర్వాశ్రమంలో చదివిన సినిమాపత్రికల విజ్ఞానం జ్ఞాపకం వచ్చింది. కాఫీయా టీయా ఓవల్టీనా హార్లిక్సా అని అడుగుతుందని అనుకుంటూ, యేం జవాబివ్వాలో ఆలోచించుకుంటూ ఉండగా 'వస్తా, పనుంది' అని లేచి వెళ్ళిపోయింది.

"మరే! కాదుమరీ, పాపం" అనుకున్నాడు ఆనందరావు.

ఇవాళ తనని చూచి పలకరించనేలేదు. పైగా, ఆవిడయెదుట పరాభవం జరిగిపోయింది. నాకానికి బయల్దేరిన నక్క అనుకుంటుంది కాబోలు. కథ, సినేరియోలూ, పాటలు రాయడంలో, తనకున్న ప్రతిభ; నటనలో, డైరెక్షన్‌లో తన సామర్థ్యం గురించి తనకున్న ఆత్మవిశ్వాసం సంగతి ఆవిడకి సినరంతకూడా తెలియదు గదా!

ఆనందరావుకి ఏడుపొచ్చింది. గూర్ఖావాడిమీద, గేటుమీద, అందులో తారమీద, ప్రతిభకన్న డబ్బుకి ప్రాధాన్యమిచ్చే ఈ ప్రపంచం మీదా భారీయెత్తున కోపం వచ్చింది. ఇందరి నిర్లక్ష్యానికీ, నిర్దయకూ గురి అయిన ఆనందరావు అనే భావి 'ఫలానా' మీద జాలి కలిగింది. తక్షణం సినేరియో ఊహించాడు.

"క్రేణ్ షాట్, స్టూడియో గేటు అవతల కళ్ళకు గంతలు కట్టుకున్న నటీనటులూ, డైరెక్టర్‌లూ, ప్రొడ్యూసర్‌లూ, పనికిరాని వాళ్ళూ, అడ్డమైనవాళ్ళూ తిరుగుతూ ఉంటారు. గేటు ఇవతల సిద్ధహస్తుడు, ప్రస్తుతానికి మసిపూసిన మాణిక్యం అయిన ఆనందం నిలబడివుంటాడు. గూర్ఖావాడు గెంటివేస్తూ వుంటాడు. ఆనందరావు తలవంచుకొని నిమ్మదిగా అడుగులువేస్తూ పోతాడు కట్ ...లాంగ్ షాట్‌లో ఆనందరావు....తలచుట్టూ విష్ణుచక్రం. క్రమంగా ఫేడౌట్,"

బ్రహ్మాండంగా ఉంటుం దనుకున్నాడు ఆనందరావు. అనుకొని, గిర్రున వెనక్కి తిరిగి గబగబ సందు చివరకి వెళ్ళి కాఫీ హోటల్లో మూల కూర్చున్నాడు....నీరసంగా.

సర్వరు పలకరించాడు.

పరాభవాన్ని నెమరువేస్తున్న ఆనందం హుఁ' అన్నాడు.

హుఁ అంటే ఏమిటో సర్వేశ్వరరావుకి బోధపడలేదు. ఆ సంగతే చెప్పాడు.

''కాఫీ'' అన్నాడు ఆనందం, మేలుకొని. మళ్ళా వెంటనే వాలిపోయాడు బల్లమీదకి, మత్తుగా.

మత్తుగానే ఇంకా ఆలోచిస్తున్నాడు ఆనందరావు....

....ఇవాళ స్టూడియో గేటుదగ్గర పరాభవం పొందిన ఆనంద రావు ఒకానొక రోజున సుప్రసిద్ధ భలానా అవుతాడు. ఈనాడు తనని గుర్తించని తార ఆనాడు హీరోయిన్‌గా బుక్ అవుతుంది.

''మిమ్మల్ని ఎక్కడో చూసినట్లు గుర్తు సార్'' అంటుంది సెట్ మీద కొచ్చాక.

డైరెక్టర్ ఆనందరావు మందహాసం చేస్తాడు.

''195 డాష్ సంవత్సరం, ఫలానా నెల ఇన్నో తేదీన మునురుగా ఉన్నవేళ మీరు కారులో స్టూడియోకి వెళ్తూవుండగా గేటులో మాసిన బట్టలు వేసుకున్న ఒక ఆసామిని గూర్ఖా 'హటో' అని దబా యిస్తున్నాడు. ఆనాటి అవమానితుణ్ణి మీరు చూసీ చూడనట్టు, నవ్వీ నవ్వనట్టు ...''

''కాఫీ సాపడు సార్'' అన్నాడు సర్వరు.

ఆనందం అదిరిపడి మేలుకొని ఇకిలించాడు.

కాఫీ చల్లారుస్తున్నాడు సుప్రసిద్ధ సినీహీరో 'ఆనంద్'.

'ఏమిటి ఆలోచిస్తున్నారు?'' అన్నాడు పెద్ద ప్రొడ్యూసరు.

''కాలచక్రం....195 డాష్ సంవత్సరంలో డాష్ నెలా ఫలానా తేదీన ఇన్ని గంటలకు సినేరియోదస్త్రం చేత బట్టుకొని, ఒక స్టూడియో గేటులో నిలిచి పరాభవం పొందిన ఆనందరావు . ఈనాడు బాక్సా....

''మురుహా, అప్పనే, ఆంతవా'' అంటూ లేచాడు ఆనందం ప్రక్కకుర్చీలో కూర్చున్న ఎవడో.

ఆనందరావు మేలుకుంటున్నాడు—కాజాలని రచయితగా, దర్శకుడుగా, కెమెరామెన్‌గా, ఎవడుపడితే వాడుగా!

బయట వాన పడుతోంది. ముసురుపట్టింది. ఆనందరావు కాఫీ గటగట తాగేసి సిగరెట్టు ముట్టించాడు.

కాదలచుకున్న హీరో ఎవరో కాఫీ తాగి పోతూ పోతూ ఆనందాన్ని చూసి సలాం కొట్టిపోయాడు.

"ప్రమాదో, ధీమతామపి" అనుకున్నాడు ఆనందం. 'ఛప్ నోరుముయ్, అని వెంటనే అనుకున్నాడు అతను తనకి పొరబాటున సలాం కొట్టలేదు ఏ డైరక్టరుతోనో, ప్రొడ్యూసరుతోనో చూసి వుంటాలి. తనంటే పడిచచ్చే వరహాలు లేడూ?

ఎందుకు లేడు? బోలె డున్నాడు. లావుగా, ఆరడుగుల రెండు అంగుళాల ఎతున .

అంత వరహాలూ లోపలి కొచ్చాడు. రొప్పుకుంటూ. దండం బాబూ అన్నాడు.

సినిమావాళ్ళంతా ఆనందం చెబితే వింటారని వరహాలు నమ్మకం. వరహాలు దగ్గరున్నప్పుడు ఆనందానికీ అదే నమ్మకం.

"రావోయ్ వరహాలూ" అన్నాడు ఆనందం.

వరహాలు వచ్చాడు

"షూటింగు కెల్తారా బాబూ? ఇయ్యాల జైలు షూటింగంట" అన్నాడు.

"మరే, వెళ్ళాలోయ్. ఇవాళ నా సినేరియోని ఓ ప్రొడ్యూసరు చూస్తా నన్నాడు. తీరిక చేసుకు వస్తానన్నాను" అన్నాడు ఆనందరావు హుందాగా.

"మరింకేటి? ఎల్దారి నెగండి. నా కియ్యాల ఎలాగేనా రౌడీ యేసం ఇప్పించాల."

"నీదగ్గిర డబ్బేంతుంది చెప్పు. ఆ గూర్ఖావాడికి కాస్త పారెయ్యాలి. పిల్లలవాడు, నాలుగుసార్లడిగాడు" అన్నాడు ఆనందం గబుక్కున.

"ఏం లేదు బాబూ. మా సిట్టి ఇంకా పంపలేదు. శేత్తబ్బు లుంటే ఈడకి నడిసొచ్చా" అన్నాడు వరహాలు. ఆనందం నవ్వాడు.

ఇద్దరు బయల్దేరారు. వచ్చే కార్లు పోయేకార్లూ, చూసే పెద్దలూ చూడని పెద్దలూ చూడలేని పెద్దలూను. ఆనందానికి ఒళ్ళు చచ్చిపోయి నట్లయింది, తను అలా రోడ్డునపడి నడుస్తున్నందుకు. రోజూ నడుస్తున్నా, ఏ రోజు కా రోజే ఒళ్ళు చచ్చిపోయినట్లవుతూ ఉంటుంది అతనికి.

"బాబూ" అన్నాడు వరహాలు.

"ఏం?"

"ఇయాల పొద్దుటేల మా ఇంటికాడ పిచ్చర్ కంపెనీ కెల్లా నండి. అంతవరకు ఇత్తానిత్తానని ఇయ్యాల ఎగేసి, నేదన్నారండి. ఆడి మాట నమ్మి, నేను మాసిట్టికి ఉత్తరం రాసేసినాను."

"ఈ సినిమా వాళ్ళంతా ఇంతేనోయ్" మాట నిలకడ లేదు ఒకడికీ. 'నాసంగతి చూడూ' అన్నాడు ఆనందరావు.

ఆనందరావు సంగతి అచ్చ తెలుగులో చెప్పాలంటే లాటరీ కొట్టడం. అతను శాంపుల్ సినేరియోలు రాస్తాడు. ఎవర్నో అడుగు తాడు. వాడు చూస్తానంటాడు. చూడడు. చూసే అర్హత కలిగిన రోజున, 'ఎవడేనా కథరాస్తాడు కాని, ఆలూ చూలూ లేకుండా సినేరియో రాయట మేమిటండీ? పొండీ, మీరు బొత్తిగా అన్యాయమండీ" అంటాడు.

నిజానికి ఆనందరావు కొత్తలో వేషాలు సంపాదించడానికి ప్రయత్నించాడు. అది కలిసిరాక, అసిస్టెంటు డైరెక్టరు అవుదామని ఆశపడ్డాడు. రద్దీ ఎక్కువ. టెక్నికల్ సైడు "ట్రై" చేశాడు. అంబ పలకలేదు. అదీ ఇదీ అన్నాడు. ఏదీ సాగిరాలేదు. చివరికి 'సినిమా కథలు' రాయడానికి సిద్ధపడ్డాడు. నాలుగైదు రకాల హీరో పాత్రలూ, వాటికి వ్యతిరేక లక్షణాలుండే హీరోయిన్ పాత్రలూ, విలన్, హాస్య గాళ్ళు, వాళ్ళ ప్రియురాళ్ళ వేషాల లిస్టు రాసుకున్నాడు. ఒక్క తిగిని డజను కథలు రాసుకుని సంచిలో వేసుకుని, సరికొత్త ఆశల చొక్కా ధరించి, గొప్పవాళ్ళ తొలిచరిత్రలను స్మరించి, సిగ్గూ, లజ్జా విస్మరించి

జైత్ర యాత్రకు బయల్దేరాడు.

'కాదు, ఒద్దు, నాదగ్గర కొల్లలున్నాయి, కొత్తరకం కావాలి. ఆయన ఇంట్లో లేరు. వారికి తీరికలేదు, చేతికి డబ్బువస్తే, సినిమా తీస్తే చూస్తాం' వంటి జవాబులు తీస్తే గీస్తే చూస్తే వచ్చిన జవాబులు: ఎదురయ్యాయి. ఈ కథ పాతదే. ఇదినాకు తెలుసు.డైరెక్టరు బావమరిదికిబాగులేదు.అయినా కాకపోయినా కథ ఒకడు రాయడమేమిటి? నలుగురం కలిపి తయారుచేస్తాం. హీరో అభిప్రాయం, హీరోయిన్ అభీష్టం చూస్తాం. నువ్వేం శరత్‌బాబువా, షేక్స్పియర్‌వా? అయినా వాళ్ళకే దిక్కులేదు.

నామాట విని సినేరియో తయారుచెయ్యి అది చేతనయితే సరి. వీలైతే రకరకాల పాటలు రాయి. రెడీమేడ్ సినేరియోలైతే కంటే కామకాయి. నలుగురూ కలిపి చంపడానికి నీదన్న కథలేదు కాబట్టి ప్రాణానికి హాయి.

....ఇదిగో ఇలా చూడు. నా మాట విని బాగుపడు. సాధ్యమైనంత నిరాశపడు. ఝామ్మని ఇంటికి నడు....

ఆనందరావు నిరాశపడలేదు. ఇంటికి నడవలేదు. పాయింటేస్కి అనుకున్నాడు. పెద్దల అడుగుజాడల్లో బయల్దేరాడు. ప్రాబ్లెం, సొల్యూషన్ మూడుముక్కలూ రాసేసి, క్షణంలో ఎవరికైనా తెలిసేలా మూడున్నర ముక్కల్లో కథ రాసుకున్నాడు. దీనికి సినేరియోలు దస్తాలకొద్దీ ఉత్పత్తి చేశాడు.

ఈ వ్యవసాయాచరణ సాగిస్తున్నంతకాలం అతనికి జరుగుబాటు ఎలా పొసగిందో అతనికి తెలియదు. తరచుగానే భోజనం వంటిది చేస్తూ ఉండేవాడు. ముప్పూటలా ఆశలు మాత్రం సుష్ఠుగా పీకమొయ్యా భోంచేసేవాడు. బస్సుకి డబ్బు లేనప్పుడల్లా ఊహా లెక్కసవారి చేసేవాడు. పరాభవం పొందినపుడల్లా వరహాలుని కసిరికొట్టి ఓదార్చుకునేవాడు....

"వరహాలూ, అదీ కథ. చూశావుగా నా సంగతి? సంచినిండా కాగితాలు, వాటినిండా మనుషులు. రకరకాల వాళ్ళు, దుర్మార్గులు, మంచివాళ్ళు, అందగాళ్ళు, అమాయకులు, చాణక్యులు, చంద్రగుప్తులు,

నాగేశ్వరరావులు, రామారావులు, రంగారావులు, రేలంగి వెంకట్రామయ్యలూ. వాళ్ళమీద నా ఆశలూ వాటిమీద సౌధాలూనూ....''

''మరి నా మీద రాయలే దేమిటి? నేను లేనా అందులో?''
అన్నాడు వరహాలు.

ఆనందం పకపక నవ్వాడు. ''సారీ, నువ్వులేవు వరహాలూ. నేను సృష్టించిన పాత్రలన్నీ హీరో హీరోయిన్ మొదలైన పెద్ద తరహావి. కథలు అమ్మ చూపినపుడు ఇవే ముఖ్యం అన్నమాట. నీ వంటి చిన్న చిన్న పాత్రలు తరవాత ఎక్కిస్తాం అన్నమాట''
అన్నాడు.

''నేను పెద్ద వేసాలు ఎయ్యలేనంటావా? అసలు అట్టాంటియి మనకు దొరకవా?'' అన్నాడు వరహాలు బిక్కమొహం పెట్టి.

''ఛ ఛ! అలా బెంగెట్టుకుని అంతలోనే అలా అయిపోతే ఎలా? నే చెప్పలే... ముందర చిన్న చిన్న వేషాలు వేస్తారు ఎవర యినా సరే. ఎంత పెద్ద యాక్టరేనా సరే నన్నమాట. ముందర చిన్న ఎక్స్ట్రా వేషాలు కట్టాల్సిందే. నీవంటివా ళ్ళున్నా రనుకో....''

''ఉంటే ఏటవుద్ది?''

''చూడు వరహాలూ, నువ్వు ముందర బాగా మాట్లాడడం నేర్చుకోవాలి. ఏటవుద్ది అనకూడదు. ఏమవుతుంది అనాలి. అలా అంటేనే సినిమాలో ఛాన్సు.''

''పోవయ్యా నువ్వు మరీని. సినిమాలో అయితే మాత్రం రౌడీలు ఏటవుద్ది అనకుండా పెద్దబాస మాట్లాడితే ఏటవుద్ది? రసాభాసం అవుద్ది—నెగేస్....ఈడు అసలు రౌడీయే కాదు. వేసం ఏశాడు పీసం; అంటారు'' అన్నాడు వరహాలు.

'నమస్కారమండి'' అన్నాడు ఆనందరావు దూసుకుపోయిన కారును చూసి మందహాసం చేస్తూ.

''ఏ టది?'' అన్నాడు వరహాలు.

''ఎవరో నాకు తెలిసిన డైరెక్టరు లే''

అంటూ, ఆగి, కాస్త దర్జాగా సిగరెట్టు తీసి ముట్టించాడు ఆనందం. వరహాలు దిగాలుగా నిలబడ్డాడు.

"చూడు వరహాలూ! అలా దిగులుగా ఉండకు. నువ్వు అమాంతం ఎలా గొప్పవాడి వవుతావో చెప్పనా?"

"చెప్పండి మరి"

"నువ్వు ఎక్స్ట్రా వేషం వేశా వనుకో. ఓ సినిమాలో హీరో ఏడుస్తూ గంభీరంగా పెద్ద డైలాగు చెబుతూ ఉన్నప్పుడు, నీ వంటి వాళ్ళంతా గుంపుగా చుట్టూ ఉంటారు. హీరో యాక్షన్కి నువు, రియాక్షన్ చూపిస్తావు, నీకు తెలియకుండానే. తరువాత ఏ డైరెక్టరో, ప్రొడ్యూసరో ఆ సినిమా చూస్తూ ఉంటే, నీ మీద దృష్టిపడుతుంది. 'ఆ లావుపాటి అతను ఎవరు చెప్మా, డైలాగు లేకపోయినా అంత చక్కగా నటిస్తున్నాడు' అనుకొంటాడు. వరహాలూ, దాన్నే 'స్టిరింగ్ ఎసీవ్' అంటారు. అప్పు డేమవుతుందో తెలుసా? క్షణాలమీద టెలిఫోను మీద అంచీలమీద వాకబు చేసేస్తాడు. నిన్ను బుక్ చేస్తాడు. అంతే. అదే మొదలు. నెల తిరిగేసరికి నువు పెద్దస్టార్వి అయిపోతావు. అప్పుడు నిన్ను చూసి కథలు రాస్తా రన్నమాట" అన్నాడు.

"అప్పుడు రౌడీ యేసాలు ఎయ్యొచ్చు గదూ?" అన్నాడు వరహాలు హుషారుగా

"ఒక్క రౌడీ ఏమిటి, అడ్డమైన వెధవ్వేషాలూ వేసెయ్యొచ్చు. హీరో, విలన్, హాస్యగాడు వెయ్యొచ్చు నీకు సరదాగా ఉంటే. సాధించలేనా అనుకుంటే హీరోయిన్ గూడా వెయ్యొచ్చు. నీ పలుకు వేదం అవుతుంది. నువ్వు బాక్సాఫీస్ పిచికవి అయినపుడు నీ మాటకి అడ్డెక్కడ, నీకీర్తికి ఒడ్డెక్కడ?...."

వరహాలుకి ఇదేం నచ్చలేదు.

"అయ్యన్నీ నాకు తెల్దుగాని, నాకు రౌడీయేసం కావాల. రౌడీ అంటే మంచోడన్నమాట ఒవరన్నా నలుగురు ఎదవ రౌడీలున్నా రనుకో, ఆ నాయాళ్ళు ఓ పడుచు తిన్నంగ ఎల్తుంటే, దాన్ని అటకాయించి ఆపాల. యెదవేసా లేత్తా రనుకో, అప్పుడు ఓమంచోడు అసలు ఆణ్ణందరూ రౌడీ ఎదవ అనుకుంటూ ఉండాలన్నమాట.... అప్పుడు ఆ మంచి రౌడీ ఏం సేత్తాడంటే."

"తెలుసు లేవోయ్-ఆ నలుగురిని పట్టుకు చావమోది, ఆపిల్లని

'తల్లీ' అంటాడు అంతేగా! ఎప్పుడూ ఉన్నదేగా మన పాట''
అన్నాడు ఆనందం విసురుగా విసుగ్గా.

వరహాలు చిన్న బుచ్చుకున్నాడు. ''అలా కరవాత్తే నేనేటి సెప్పేది బాబూ? నేను అలాటి ఏసం ఏత్తే సూడాలని మా పిట్టికి మనసు. అందుకే గందా వచ్చింది'' అన్నాడు

ఆనందం మాటాడలేదు.

వరహాలు రెండుసార్లు పలకరించి,కోపం వచ్చిందని గ్రహించి నోరు మూసుకున్నాడు....

లావుగా పొడుగ్గా ఉన్న వరహాలు, కాస్త బొద్దుగా ఓ మోస్తరు పొడుగ్గా ఉన్న 'భవిష్యత్ఫలానా' ఆనందరావూ చెట్టా పట్టా లేసుకు స్టూడియో గేటుదగ్గర కొచ్చేసరికి, కాబోలనుకునే హాస్యగా డొకడు, పకాలున నవ్వి 'తేగాబద్దా' అని మళ్ళీ పకాలున నవ్వాడు.

వరహాలు చిన్న బుచ్చుకున్నాడు. ఆనందం మాత్రం పట్టలేక, 'తొక్క' అన్నాడు ఆ హాస్యగాణ్ణి చూచి.

గేటవతల దూరాన ఓ జూనియర్ ప్రొడ్యూసరు కనబడ్డాడు. ఆయన్ని చూడగానే ఆనందానికి ప్రాణం లేచొచ్చింది. ఆనందరావు కధని సినిమా తీస్తానని, కథగా వీల్లేకపోతే, ఒక డాక్యుమెంటరీ అయినా తీసిపారేసి గవర్నమెంటు వాళ్ళకి అమ్మిపారేస్తానని ఆయన బెదిరిస్తూ వచ్చాడు.

''నమస్కారం అండి'' అన్నాడు ఆనందం. అంటూనే, చొరవగా, గేటుదాటి లోపలకి ఎదురేగాడు. అతని వెంటనే వరహాలూ చొచ్చు కెళ్ళిపోయాడు.

''జూప్రో'' గారు స్టూడియో రోడ్డుప్రక్కన ఓ చెట్టుకింద ఉసూరు మన్నారు. శుభసూచకం అనుకున్నాడు ఆనందరావు— ఆయన ఆగడం చూసి. అనుకోడం, తన కథ సంగతి అడగడం, ఆయన ప్రతిభ పొగడటం క్షణాలమీద జరిగిపోయాయి.

''ఆఁ, ఏమయ్యా నీ బొద? ఇప్పుడు కాదు నీ కథ'' అనా డాయన విసుగ్గా.

ఆనందం అపార్థం చేసుకున్నాడు. పొగడ్త డోసుచాల తేదని.

తన దుస్థితి ఆవేదన టెక్నికలర్‌లో చిత్రించలేక పోయాననీ అను కున్నాడు. అనుకొని మళ్ళీ పుంజుకున్నాడు.

"అన్నీ విచిత్రమైన పాత్రలండి. విచిత్రమైన కాంబినేషన్ అండి. మంచి మెలోడ్రామా ఉందండి. మీరు తప్ప ఇంకోడు న్యాయం చెయ్యలేడు"

వరహాలుకి ఓపిక తగ్గుతోంది. అవతల వేషం పోతుందని బాధ.

"ఆనందం! ఎల్లారా?" అన్నాడు మెల్లిగా.

"ఉండవయ్యా, నువ్వూ నీ సొదాను!" అన్నాడానందం.

జాప్రొ ఒక్కసారి మట్టగిడసలా తన్నుకున్నాడు. ఉత్సాహ అభినయసూచకంగా "నమస్తే నమస్తే" అంటూ చేతులు ఎగరేశాడు స్టూడియోలోంచే వస్తున్న ఓ కారుని చూసి.

ఆ కారులో ఓ ప్రొడ్యూసరున్నాడు. అతని చేతులో పలుకు బడి, దాని క్రింద స్టార్ వాల్యూగల హీరో హీరోయిన్ విలన్‌లూ ఉన్నారు.

వాళ్ళలో ఏ ముగ్గురి—కనీసం ఏ ఇద్దరి లేదా ఏ ఒకరి సంతకం ఉన్న కాంట్రాక్టు సంపాదించినా, డిస్ట్రిబ్యూటరు సులభంగా పెట్టుబడి ఇస్తాడు. పెట్టుబడి మినహా ఉత్సాహం, ఉబలాటం ఉద్రేకం మొదలైన ఇతర హంగులన్నీ ఉన్న జాప్రొ గారికి హఠాత్తుగా ఈ ఊహ తోచింది. గిరాకీ ఉన్న 'స్టార్స్' సులభంగా దొరకరు. చేత డబ్బులేనప్పుడు కాస్త పలుకుబడి ఉన్నవాళ్ళ సిఫార్సులు కావాలి. ఆ క్షణానికి ఇంకో జాప్రొకి కూడా అలాటి ఊహే తోచినట్లు ఈయనకి తెలిసింది. అతగాడు ఈ పెద్ద ప్రొడ్యూసర్ని ప్రతిమాలి బామాలి సిఫార్సు సంపాదించడానికి శపథం పట్టి, ఆయన ఇంటిదగ్గర కాసుకు కూర్చున్నాడట. అందుకని, ఈయన్ని దార్లోనే అటకాయించి, ఆ సిఫార్సువరం ఇస్తానని ఒట్టేయించుకోవడానికి ఈయన తహ తహ లాడుతున్నాడు. స్టూడియోలోనే చూచాడు గాని, అక్కడ ఇంకా నలుగు రున్నందువల్ల, దూరం ఆలోచించి, కొంచెం ఇవతలగా దారి కాశాడు.

కారు ఆగింది. "నమస్తే" అన్నాడు జ్యాక్రో మళ్ళా-తనకోసం కారు ఆపినందుకు మురిసిపోతూ. కారులో ఆయన ఊహలు మరో పంథాలో నడుస్తున్నాయి. కారు ఆపి డ్రైవరు పరిగెత్తాడు. వెనక్కి. కారు లోనివారు కూర్చునే నవరసాలూ అభినయం చేస్తున్నారు.

"మీతో ఒక్క అర్జెంటు సంగతి మనవి చెయ్యాలి" అంటూ పారం మొదలుపెట్టాడు జ్యాక్రో కారులోకి తలదూర్చి....

"...అన్నీ విచిత్రమైన, విశిష్టమైన కారెక్టర్సండి. బాక్సాఫీస్ హిట్ కావడం గారంటీ....మీరు ఆ యిద్దర్నీ గనక ఒప్పించి కాంట్రాక్టు రాయిస్తారా ...మేలు మరిచిపోను....మీరు చెబితే వాళ్ళు కాదనరు...."

కారులో ఆయన వినేస్థితిలో లేడు. అద్దంలోంచి వెనక్కి చూస్తున్నాడు 'ఊ' కొడుతూనే. ఉంటుండి హఠాత్తుగా తలవంచి ఆలోచన అభినయిస్తున్నాడు

జ్యాక్రో ఆత్రుతగా చూస్తున్నాడు, 'పండా కాయా' అని.

"చూడండి. ఓ ఉపకారం చేస్తారూ?" అన్నాడు కారులో ఆయన, మళ్ళా ఓసారి వెనక్కి చూసి.

జ్యాక్రో ఎగిరి గంతేసి 'ఎంత మాట!' అన్నాడు రెండుసార్లు. అవశ్యం చెప్పండి అన్నాడు.

"ఏం లేదు ఒక్క సిగరెట్టు ఉంటే అర్జంటుగా ఇవ్వండి. మా డ్రైవరు ఇంకా రావటం లేదు."

జ్యాక్రో కొయ్యబారి పోయాడు. సిగరెట్లు తన దగ్గిర లేవన్న సంగతి గుర్తుకొచ్చి నీరుగారిపోయాడు.

ఒక్క సిగరెట్ మీద ఆధారపడి ఉంది తన అదృష్టం అంతా. వెనక్కి తిరిగి రెండడుగులు వేశాడు. నాలు గడుగులు అవతల నించున్న ఆనందం, 'ఏదో గిరాకీ' అనుకున్నాడు. "సినేరియో చూపించమన్నాడాండి?' అంటూ దస్త్రం విప్పబోయాడు ఆశగా.

"సినేరియో కాదు నా బొంద. సిగరెట్టుంటే తగలెయ్యండి.

మీరూ, మీ వెధవ సినేరియోలూనూ" అన్నాడు జూగ్రఫీ ఉద్రేకంతో వణికిపోతూ.

"మీరిలా అంటూ చనుకో లేదండి. అసలు చూడకుండానే వెధవా బోడి అని పేర్లు పెడితే ఎలా?....అన్నీ విశిష్టమైన పాత్రలు. చక్కటి మెలోడ్రామా ఉందండి."

"సిగరెట్టండీ! సిగరెట్టుందా? కొంపలు మునిగిపోతున్నాయి, ఆయన అసలే తిక్క మనిషి" అన్నాడు జూగ్రఫీ మండిపడుతూ.

"సిగరెట్టు లేదండి. ఐ మీన్ అయిపోయాయి. ఇందాకే ఒక టుంటే...."

జుట్టు పీకేసుకోవాలని జూగ్రఫీ హృదయం ఘోషించింది. ఒక్క సిగరెట్టు లేక తన సముజ్జ్వల భవిష్యత్తు చల్లారిపోతుంది . సిగరెట్టోయ్ అనుకున్నాడు, పళ్ళు గిట్ట కరుచుకుని. ఆ డ్రైవరు ఈలోగా తెచ్చేస్తే తన అవసరం ఉండదు. కారు వెళ్ళిపోతుంది. తన ఛాన్స్ పోతుంది.

ఇంకో రెండడుగుల అవతల ఉన్న వరహాలు వంక చూశాడు.

వరహాలు బీడి కాలుస్తున్నాడు సాలోచనగా.

విధి దుర్విధీ, గతి దుర్గతీ గిఃం తథీగిణాం అనుకొని, మతి దాదాపు పోగొట్టుకొని జూగ్రఫీ మళ్ళా కారు వంక తిరిగాడు. చిక్క మొహం పెట్టిన డ్రైవరు కారు స్టార్టు చేస్తున్నాడు. లోపల నున్న ప్రొడ్యూసరుగారి కోపంతో కారు భగ్గున మండుతోంది.

"ఆ యిద్దరికీ చెప్పి ఒప్పిస్తారుగా ...మిమ్మల్నే నమ్ముకు న్నాను" అన్నాడు జూగ్రఫీ.

"అబ్బే! అదెక్కడ కుదురుతుందండీ! డబ్బుతో పని. మీరే చూసుకోండి" అని జవాబొచ్చింది.

జూగ్రఫీ 'ఇసీ' అనుకున్నాడు. అతనికి వైరాగ్యం వచ్చేస్తోంది.

అవతల విచారంగా నిల్చున్న ఆనందం ఇంకొక్క ప్రయత్నం చేశాడు. "చూశారూ, మంచి కారెక్టర్స్ చూపిస్తే డబ్బు

లేకపోయినా కొంత మది కోతులు వినొస్తాయండి. నా దగ్గర అలాంటి వెరలు అద్భుతమైనవి ..."

"అబ్బాయ్, లాభం లేదు. అదేం కుదరదు. ఇది డబ్బుతో పని. ఇంకెక్కడైనా చూసుకో" అన్నాడు జ్యోతి. అని విసురుగా వెళ్ళిపోయాడు.

ఆనందరావుకి ఏడుపు రాబోయింది. అవతల చిమ్మిడీ అంత మొహం చేసుకు నిల్చున్న వరహాలు నెమ్మదిగా భయంతో సమీపించాడు.

"బాబూ ...ఎల్లారా సూటింగ్‌కి. ఆళ్ళు మళ్ళా ఇంకెవళ్ళనైనా తీసుకుంటారేమో" అన్నాడు

"నువ్వెళ్ళవోయ్ నా ప్రాణం తియ్యక. ఇది డబ్బుతో పని. ఎవణ్ణి పడితే వాణ్ణి తీసుకోరు. నువ్వే పోయి చూసుకో" అన్నాడు ఆనందం మహాదురుసుగా.

వరహాలుకి ఏం పాలుపోలేదు. ఎటూ కాలాడలేదు. అంత లావు అంత పొడుగు మనిషి బిక్కచచ్చిపోయి గోళ్ళు కొరుక్కుంటూ నిలబడిపోయాడు. కదిలినా మానినా ఆనందానికి ఇంకా కోపం వస్తుందని భయం.

సిగ్గుతో అభిమానంతో కుమిలిపోతూ ఉన్న ఆనందరావుకు, మామూలుగానే కోపం వచ్చేసింది. అతన్ని ఓదార్చడానికి—

"పోవయ్యా పో....నా దగ్గి రెందుకు భయం? ఇక్కడ ఎవరికెవరవుతారు? ఈ లోకంలో దయకీ ప్రేమకీ తావు లేదు. నీ దారి నీదే. పతివ్రత వేషా లెయ్యకు. నాకు ఒళ్ళు మంట" అన్నాడు.

వరహాలు దీనంగా ఒకసారి చూసి, తల వంచుకుని నెమ్మదిగా పెట్స్‌వేపు బయల్దేరాడు. చెట్టుమీద కాకి ఆనందం మీద రెట్ట వేసింది. తల పైకెత్తి చూశాడు ఆనందం. నలభై రెండు వాద్యాల నౌషద్ సంగీతం చెవిలో హోరెత్తింది. చక్కని సన్నివేశం చిత్రించవచ్చు ననుకున్నాడు.

తల వంచుకు వెళ్ళిపోతున్న వరహాలు, చక్కని హీరోయిన్ కావచ్చు...

ఆనందరావు ఆ సన్నివేశానికి నాయకత్వం వహించవచ్చు ...

ప్రేమ విడిపికొట్టిన సందర్భం అన్నమాట .. "ఛీ ఛీ.... నా దగ్గర నీకు భయమెందుకు' ఈ లోకంలో దయకీ ప్రేమకీ తావు లేదు. నీవారి నీదే పతివ్రత వేషా లెయ్యక అవతలికి పో" అంటాడు హీరో.

పరిదీనవదన అయిన సుందరి తల వంచుకుని, దుఃఖపడుతూ నెమ్మదిగా వెళ్ళిపోతుంది. నలభై రెండువాద్యాల సంగీతం భూనభాలని అదరకొట్టేస్తుంది. గుండె రాయి చేసుకున్న హీరో ఆనందరావు, ప్రపంచాన్ని చూడలేక, రపీమని తల పైకెత్తి ఆకాశం వంక చూస్తాడు. డిస్టెంట్ లాంగ్ షాట్ ....

గాజుల గల గలలు వినబడగానే, ఆనందరావు సినీలోకం లోంచి భూలోకంలోకి దిగి వచ్చాడు.

వర్ధమాన తార ఒకామె కంటి కానింది. ఆనందానికి తెలిసిన అమ్మాయే. 'సుబ్బులూ' అని పిలుస్తారు. "కాదు, కామినీ అనాలి" అంటుంది నవ్వుతూ.

"ఏమిటి, చెట్టుకొమ్మల వంక అంత శ్రద్ధగా చూస్తున్నారు? ఛాన్సు యివ్వకపోతే ఈ కొమ్మకి ఉరేసుకుంటానని ప్రొడ్యూసర్లని బెదిరిద్దామనా?" అంది కామిని.

"తాడు కొనడానికి డబ్బెక్కడ తేను?.... నేను గొప్పవాణ్ణయే లోగా నువ్వు పెద్ద స్టార్‌వి అయిపోతే, ఈ చెట్టెక్కి దూకేసి."

"అయితే విల్లా గర్బో రావి సిద్ధపడుకోండి. నెల తిరిగే సరికి నేను మీ రన్నంతదాన్నీ అవుతాను. నాకు అమ్మమ్మ దొరికింది. ఒట్టు" అంది.

"ఎప్పుడూ? ఎలా? ఎక్కడా?" అన్నాడు ఆనందం కళ్ళు పెద్దవి చేసి.

'ఈ ఊళ్లోనే లెండి. ఇంక చూస్కోండి, అదృష్టం ఎలా తిరుగుతుందో" అన్నది కామిని.

అమ్మమ్మ గార్డియన్‌గా ఉన్న వాళ్ళందరికీ అదృష్టం చప్పున పడుతుందనీ, అతి త్వరగా తారాపథంలో కారెక్కి ఊరేగవచ్చునసీ

ఆ పెళ్లి శ్రీమోఫిలాపి ఎవరో గట్టిగా నచ్చచెప్పి, అందుకు ప్రత్యక్ష నిదర్శనాలు చూపించారు.

కామినికి ఆ బాపతు బంధువు లెవరూ లేరు. ఉంటే, సిరి వస్తుందని ఆశ. అందుకని వెతికి వెతికి, మనవరాళ్లూ గట్రా లేక అవస్థపడుతున్న ఓ అమ్మమ్మని మాట్లాడి కుదుర్చుకుంది.

"ఊహ మంచిదే" అన్నాడు ఆనందరావు మందహాసం చేస్తూ. చూసి చూసి గట్టిగా నవ్వి హేళన చేయడానికి మనసొప్ప లేదు అతనికి.

"అమాయకత్వం వల్ల నీ అందం మరింత శోభిస్తోంది సుబ్బులూ" అన్నాడు కాస్త ఆగి.

'మీరు బలేగా మాట్లాడతారు. ఇక్కడ వర్ణించకపోతే, అవన్నీ డైలాగులుగా రాసి ఎవరికన్నా చూపించరాదూ?" అంటూ కిల కిల నవ్వింది కామిని.

"నువ్వు బలేగా నటిస్తావు—లోపల నకనక ఆకలేస్తున్నా ఎంత కులాసాగా ఉన్నావు!"

"మీకేమన్నా ఆకలేస్తుందా చెప్పండి. డబ్బు లిస్తా" అంటూనే కొండినున్న బొందుసంచి తీసింది కామిని.

"అదేవిటి సుబ్బులూ? పల్లెటూరి సంచీ నువ్వూను."

"ఓస్... ఫాషనుగా తిరిగేవాళ్ళు పట్టుకు తిరిగే ఎరకల బుట్టల వాటికేం తీసిపోదు లెండి! ఎంత కావాలి చెప్పండి. నా దగ్గర ఆరణా లున్నాయి" అంది.

"అబ్బే! నాకేం వద్దు ఊరికేనే అన్నా."

"పోవయ్యా! నా దగ్గర మొహమాటం ఏమిటి? బేడ తీసుకుని కాఫీ తాగు ...కష్టార్జితంలే. అన్యాయం డబ్బు కాదు" అంది కామిని.

ఆనందం ఆమె వంక చూశాడు. కామిని కళ్ళు సూటిగా వాడిగా నిష్కల్మషంగా అతని వంక చూశాయి.

పక్కున నవ్వింది. "మీరు చాలా మంచివారు. నేను పెద్ద

స్టారుస్నై, చాలా డబ్బు సంపాదిస్తే...." అంటూ చేత అతని జేబులో వదేసి చర చర నడిచి వెళ్ళిపోయింది, కామినీ కుమారి.

"సుబ్బు లిచ్చిన డబ్బులు" అని గొణుక్కున్నాడు ఆనంద రావు కదలలేక, మెదలలేక.

"సుబ్బు లిచ్చిన డబ్బులు...." సినిమా కథకి చక్కని పేరు. మంచి కథ అల్లవచ్చు. చక్కని సినేరియో రాయొచ్చు. బ్రహ్మాండ మైన పిక్చరు తియ్యొచ్చు. ఆనందరావుకి మతిపోయింది. అర్జెంటుగా సినిమా తియ్యాలనుకున్నాడు. అంతకన్న ముందు కథ రాయాలిగా' సినేరియో, పాట, స్టూడియో కాంటీన్‌కి వెళ్ళి కాఫీ తాగేశాడు గబగబ.

* * *

గబగబ హుషారుగా తిరిగేసి ఇద్దే రూపాయి అప్పు సంపాదించాడు. దస్తా కాగితాలు, పెట్టి సిగరెట్లు కొనుక్కొని, ఇంటికి బయలుదేరాడు. సందు మొగలో కిళ్ళీకొట్టు బడ్డీకి బాకీ అర్ధరూపాయి చెల్లించి, స్వేచ్ఛగా గాలి పీల్చి, చకచక గదికి వెళ్ళి కథ రాయడం మొదలుపెట్టి సాయంత్రం దీపాలవేళకి ముగించి అవతల పారేశాడు.

* * *

ఇంటాయన విశ్వనాథంగారు తొంగి చూశాడు. "ఏమిటి బాబూ, చెడ రాసేస్తున్నావు" అన్నాడు నవ్వుతూ.

"కథండీ, అద్భుతమైన కథ! అత్యద్భుతమైన పాత్రలండి... చూస్తారా, చెప్పనా...." అన్నాడు ఆనందరావు.

"నా కెందుకోయ్! ఏనాడూ వాటి జోలికి పోనివాణ్ణి. నాసిఫార్సు ఇచ్చావా?"

"లేదండి—పొద్దున ఒక కథ పట్టుకు బయలుదేరాను.దారిలో ఇది తోచింది. సరే ఇది రాసి చూపిద్దా మని వెనక్కొచ్చేశా" అన్నాడు ఆనందం.

విశ్వనాథంగారు నవ్వి వెళ్ళిపోయారు.

ఆనందం తల దువ్వుకుని, కాగితాలు చేతపట్టుకుని బయలుదేరాడు.

గంటలో గబగబ తిరిగొచ్చాడు. అతను కలుసుకున్న ఆసామి

విచారం వెలిబుచ్చాడు. ఆర్నెల్ల తరువాత కనబడితే తప్పకుండా ఆలోచిస్తానని హామీ ఇచ్చాడు. అప్పటికి కాస్త కాఫీ కూడ ఇచ్చాడు. నాయనా! .. ఆయన వ్యాపారదక్షుడు కాడు.... కాని వాళ్ళకిప రోజులు కావు.

ఆయన మీద కొండంత ఆశ పెట్టుకు వెళ్ళిన ఆనందరావు బోలెడు జాలి పడి కన్నీరు కారుస్తూ, ఇంటికి చక్కా వచ్చి, సిఫార్సు ఉత్తరం ఇచ్చిన విశ్వనాథంగారికి ఆ ముక్క కాస్తా చెప్పి తల వాల్చి నిల్చున్నాడు.

"ఫరవాలేదు లేవోయ్, నేను కనుక్కుంటాలే....నాకు ఈ ఫీల్డుతో ప్రమేయం లేకపోయినా, తెలిసినవాళ్ళు కొంద రున్నారు. కనుక్కుంటాలే, భయపడకు" అన్నా డాయన.

* * *

ఆనందరావు గుమ్మంలో కొచ్చేసరికి వరహాలు కనబడ్డాడు. మెట్ల దగ్గర నిల్చున్నాడు, విచారంగా మీసాలు దువ్వుకుంటూ.

ఆనందానికి తన మీద కలిగిన జాలి యావత్తూ, వాత్సల్యం అయిపోయి, వరహాలు మీదికి మళ్ళింది.

"ఏం వరహాలూ, అలా ఉన్నావ్? రా, లోపలికి. వేషం ఇవ్వ లేదా?" అన్నాడు ఆప్యాయంగా.

ఆనందం కోపం తగ్గినందుకు వరహాలు మురిసిపోయి లోపలి కొచ్చాడు.

"లేదు బాబూ, దొంగలసీను షూటింగయిందండి. రౌడీ యేసం అసలు నేదన్నారు. పోనీ దొంగోడి యేసమేనా ఇమ్మంటే నేదు పొమ్మన్నారండి! కావలిస్తే లావుపాటి పోలీసోడి రోలిచ్చుకో మన్నా రండి."

"ఏడవకపోయారు! లావుకాపోతే, సన్నపాటి వాడి వేషం నీ కెలా యిస్తారు?" అన్నా డానందం నవ్వుతూ.

"అస లది కాదండి. దొంగోడి ఏసం అయితే డైలాగు లేక పోయినా కొంత యాక్సన్ సెయ్యొచ్చు. ఇదే టిది బొమ్మలా నిల్చొ

నేమి? అదినరే. యేసం లేకపోవడం సాలక యేలాకోలం గూడా ఆడారండి. నేనంట.... లావంటూ . ''

''కాదు మరీ'' అన్నాడు ఆనందరావు నవ్వుతూ.

''మరంటా.... నాకు పొంగోడి యేసం ఇత్తే జైలు సెట్టింగు అసలే పట్టదంట.''

''పోన్లే అదే పోయిరి. ఇలాటి వాటికి ఖాతరు చెయ్యకు. నీకు మంచి వేషం నే విప్పిస్తా'' అన్నాడు ఆనందం.

''నాకు రౌడీ యేసం కావాల. మంచో డన్నమాట. దారంట ఎల్లే ఓ యాడుపడుచుని నలుగురు ఎదవ నాయాళ్ళు అల్లరి పెడతా రనుకో ....''

''మరే, మరే, అప్పుడు నువ్వు వాళ్ళని చావగొడతావు.''

''అద్గదీ ... మళ్ళా సూత్తానికి నేను రౌడీలాగే ఉంటా ...''

''అలాగే ఉందుగాని, తందుగాని ... పద, అలా వెళ్లొద్దాం'' అన్నాడానందం.

* * *

రోడ్లని అరగతీసే వాహనాలకి సర్కారువారు పన్ను వసూలు చేస్తారట. ఆనందం వాహనం అకుజోళ్ళు. సినిమా కంపెనీలూ, డైరెక్టరూ, నటీనటులూ ఉండే రోడ్ల వెంట తిరిగి తిరిగి అరిగి పోవడంతోపాటు కొన్ని రోడ్లను అరగతీశాయి! గవర్నమెంటువారిది గమనించలేదు. గమనిస్తే చాలా మందికి జరిమానా వేసి, పోషించవలసి వస్తుందిగదా అని. లావుపాటి వరహాలు అలాగే రౌడీ వేషం కోసం రొప్పుతూ తిరిగి తిరిగి అలిసిపోతున్నాడు.

ఆనందం అద్దెకున్న ఇంటాయన విశ్వనాథంగారు కూడా, ఆనందానికి సహాయం చేయడం కోసం, పాపం, ముప్పూటలా పని కలిగించుకుని ప్రదక్షిణత్రయం సాగిస్తున్నారు. 'సినిమా ఫీల్డు మంచి దేస్మీ' అన్న ఊహ కలిగిందాయనకి క్రమంగా.

* * *

హఠాత్తుగా ఒక రోజున ఆనందరావు ముఖం చాలా రోజుల తరవాత తొలిసారిగా ఆనందపూరితం అయిపోయింది, ఒకానొక

తెలివితేటల్ని తలదన్నే నేర్పుతో దొంగలు తిరుగుతారు. దొంగల నేర్పుని మించి వీళ్ళు తిరుగుతారు. అది ఒక కళ. ఆ కళలో అమెరికన్లు మనని తరిఫీదు చేస్తున్నారు. క్రైమ్ పిక్చర్ల ద్వారా ఇంగ్లీషు సినిమాలకి ఖర్చుపెట్టిన డబ్బులు దండుగ కాదనిపించింది సుబ్రహ్మణ్యానికి.

డిటెక్టివ్ సుబ్రహ్మణ్యం బుర్ర వేడిగా పని చేసింది. సెంట్రల్ హాల్లోంచి మహా వేగంతో పక్కనున్న చిన్న హాల్లోకి ప్రవేశించాడు. అదొక చిన్న వసారాలా ఉంది. అక్కడే టిక్కెట్లు అమ్ముతారు. అక్కడున్న బెంచీల మీద పనిలేనివాళ్ళు, ఇళ్ళులేని వాళ్ళు, ఇల్లు వుండి పనిలేని ఇతర బాపతులవాళ్ళూ కూచున్నారు. బీడీ దమ్ములు లాగుతూ కునికిపాట్లు పడుతున్నారు. పావునిమిషంలో క్షుణ్ణంగా వెతికేసి తమ్ముడు తప్ప తక్కిన వాళ్ళందరూ ఉన్నారని అనుకుంటూనే వరండా చివరకి చకచక నడుస్తున్నాడు. లోపల కవి కదిలాడు. "ఈ పనిలేని అనాథులూ, అభాగ్యులూ అయిన భారతీయులు ..." సుబ్రహ్మణ్యం వినలేదు. తన సంగతి ఏదో తేలదేదు; ఇంక భారతీయుల గొడవెందుకో పైగా?

వరండా చివరికి చేరగానే కాంపౌండు అంతా కలియ చూశాడు. వరండా రెండో చివర కాంటిన్ వుంది. అక్కడ తన తమ్ముడుగాని టిఫిన్ పుచ్చుకుంటున్నాడేమో!.... "టిఫిన్‌కి తెలుగు అల్పాహారం" అన్నాడు కవి. "హుఁ" అంటూ నిట్టూర్చాడు సుబ్రహ్మణ్యం.

ఈమాటు సెంట్రల్ హాలు పూర్తిగా చూడాలి. అప్పటికీ తమ్ముడు కనబడకపోతే పోలీసు రిపోర్టు యిస్తాడు సుబ్రహ్మణ్యం. అతనికి చాలా మంచిదీ, పిసలైనదీ అయిన ఇంగ్లీషు భాష 'యాంకీ స్టయిల్'లో ధారాళంగా మాట్లాడే సత్తా వుంది.

ఆఖరిమాటు వరండా కలయజూచాడు. కవి మెదిలాడు. "ఈ పనిలేని అనాథులూ, అభాగ్యులూ అయిన భారతీయులు తిన తిండీ, నిలువ నీడా, కట్టుకోడానికి... " సుబ్రహ్మణ్యానికేడుపొచ్చింది. బాధ, ఆవేదన, జాలి, దైన్యాలతో నిండి పొంగి పొర్లిపోయే చూపు

ఆసారి కసిరి చూశాడు. "నువ్వు దయచేసి ఊరుకుంటే బయటికెళ్లాక సిగరెట్టు కాల్చుకుందాం." అని ఆశ పెట్టుతూ.

సెంట్రల్‌లో హాల్లోకి ప్రవేశించి ఐదడుగులు వేసేలోగా తమ్ముడి దక్కరైన లేదనే సిద్ధాంతం కొచ్చాడు. అంతా ఖాళీగా వుంది — అక్కడక్కడ ఓ పోర్టరు, ఒక ఆంగ్లోఇండియన్ లేడీ, బరువు తూచుకునే మెషన్‌లోకి తొంగి చూస్తున్న ఒక భారతీయ కార్మికుడూ తప్ప. తన తమ్ముడు మాత్రం లేడు 'వాడొక్కడూ వుండి ఈ మెషిన్ అందరూ లేకపోతేనేం' అనుకుంటూ పైనుంచి వేళ్ళాడే పెద్ద గడియారంలో 9 గంటలా 18 నిమిషాల టైము చూసి, ఆంగ్లో ఇండియన్ అమ్మాయి వంపులు బాగా పరిశీలించబోయాడు. పరిశీలించను కాని, కవి ఊరుకోవటం లేదు. పోర్టరుగాథ, కార్మికుడి బాధ ఏకరువుపెట్టి గేయం కట్టబోయాడు. గేయం కట్టేవాడేకాని సుబ్రహ్మణ్యం తన తమ్ముడిని గురించి ఆలోచించబోయాడు. ఆలోచించనుగాని, 'డేయ్' (అంటే తెలుగులో ఒరేయ్) అని ఎవడో ఎవణ్నో పిల్చాడు,

సుబ్రహ్మణ్యం "ప్"అని పెదిమలు, నాలిక, పళ్లూ బలవంతాన విడదీసి, చిన్న చప్పుడు చేసుకున్నాడు. "ఒరేయ్' అని పిల్చుకోవడం ఇద్దరు మనుష్యుల స్నేహంలోని దగ్గరదనాన్ని చూపుతుంది కామోసు ...బాగా స్నేహం వున్న జంతువులు ఏమని పిల్చుకుంటాయో!" వెంటనే సుబ్రహ్మణ్యం ఆలోచన భగవంతుడి సృష్టి వైచిత్ర్యం మీదికి పోయింది.

"డేయ్! వున్నైదాండా" (ఒరేయ్ నిన్నేరా) సుబ్రహ్మణ్యం త్రుళ్ళిపడ్డాడు. ఎందుకంటే, కేక తన వెనుక నుంచి వస్తోంది. తన ముందు పోయేవాళ్ళెవరూ లేరు. అర్థం కాని కుతూహలంతో వెనక్కి తిరిగాడు.

"ఒరేయ్! నిన్నేరా! ఇలా రారా!" గుండె గతుక్కుమంది. తన కవి హృదయం ఈ అనుకోని అవమానంతో దెబ్బతింది. ఎందుకంటే, ఆ అరిచేవాడు పిలిచేది తననే. వాడు చూస్తే ఓ

రౌడీలా వున్నాడు—ఓ గూడకట్టూ, పొట్టాపైన స్వెట్టరూ, నెత్తి మీద మప్లరుతో.

ఈమాటు మాత్రం ఈ పనిలేని అనాథులూ, అభాగ్యులూ అయిన భారతీయుల మీద కపికి కూడా సుబ్రహ్మణ్యాని కొచ్చినంత కోపమూ వచ్చింది. వాళ్ళకి బొత్తిగా మర్యాద తెలియ దనుకున్నాడు సుబ్రహ్మణ్యం.

"థామస్ కోసం కదూ, నువ్వు వెతికేది?"

సుబ్రహ్మణ్యం నవ్వాడు. ఆ నవ్వు వెనకాల చాలా భావ ముంది—వీ డెవడో తనని తెలిసున్నవాడిలా వచ్చేసి థామస్ గీమస్ అంటూ ఏదో చెప్పి తనని దబాయించి డబ్బులు కొట్టెయ్యడానికి చూస్తున్నాడు. సుబ్రహ్మణ్యం ఆలోచించాడు. మనసులో తోచిన అభిప్రాయాల్ని ఆలోచించకుండా బయటపెడితే పర్యవసానం చాలా భయంకరంగా ఉంటుంది. తన ఎదురుగా నిలుచున్నవాడు చూస్తే మొండిరకం రౌడీలా వున్నాడు. పది తిన్నా ఒకటి కొట్టగలడు. తనేమో పది తినాలేడు, ఒకటి కొట్టాలేడు. సుబ్రహ్మణ్యానికి జబ్బ పుష్టి లేనివా ళ్ళందరిమీదా హఠాత్తుగా జాలేసింది. వాళ్ళెంత తెలివున్న వా ళ్ళయితే నేమి? పలుకుబడి, కీర్తి, డబ్బు ఉన్నవాళ్ళయితే నేమి, ఇలాటి సమయంలో తన ఎదురుగా వున్న రౌడీ వెధవ ముందర పనికిరారు.

ఈ రౌడీ తననిలా అవమానించి పిల్చి ఇలాటి ప్రశ్న లడగటంలో వాడి అంతరంమీద తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడంటే వాడు మరుక్షణంలో తనని మహా అవమానం చేసెయ్యొచ్చు-అంటే కొంచెం చెయ్యి తొందరపడి చెంపకాయ వెయ్యొచ్చు. అంచేత, తనకు ఎంత కోపం వచ్చినా దాన్ని అణచుకుని ఓ చిన్న అర్థంకాని నవ్వుతో దాన్ని కప్పెట్టి తనని సమర్థించుకునేలాగా, ఎదుటివాడిని చాలా మర్యాదగా అణచేలాగా తన మొగతనం చూపుకునేలాగా మాట్లాడడానికి సిద్ధమయ్యాడు.

"ఏమిటయ్యా! అలా మాట్లాడతావు? థామస్ ఎవడో నాకేం తెలుసు? వాడి కోసం నే రావడ మేమిటి? నేను మైలాపూరు నుంచి

వచ్చా’’ —అమ్మాయి కోసం వెతుకుతున్నానంటే అదేం హానో అని అది చెప్పలేదు.

‘‘ఆఁ! మైసాహ్రాయిసుందా? .. మీ ఎడ్రసు’’

సుబ్రహ్మణ్యం ధైర్యంగా ఎడ్రసు చెప్పాడు. అంతేకాదు. ఈ దెబ్బతో వాణ్ణి ఇంప్రెస్ చేసి పారెయ్యాలి తాను చదివే క్లాసూ కాలేజీ పేరు కూడా చెప్పాడు. చెప్పి ఈమాటు వాడికేసి మహా ఫేమాగా చూశాడు కాని వాడు మాత్రం అణుమాత్రం కూడా చలించి నట్లు కనబడలేదు, నమ్మలేదేమో, పైగా వాడి ‘‘ఒరేయ్’’ అనే సంబోధన ఏ మాత్రం మారలేదు. ఇంతలోకే పోర్టర్ వచ్చాడు. ఈ మాటు సుబ్రహ్మణ్యంలో ఎక్కడలేని ధైర్యం ఉద్భవించింది. ఇప్పుడు తనేం వాగినా ఈ రౌడీ చెయ్యి చూపలేడు. ఎందు కంటే, ఇప్పుడు తన దగ్గర ఓ పెద్ద మనిషి ఉన్నాడాయె.

ఇంకో ఇంకో సమయంలో పోర్టరు మామూలు పోర్టరులాగే కనబడతాడు. తను వాడికేసి చూడ్డానికి కూడా లెక్క చెయ్యడు. పైగా ఎప్పుడేనా తను సామాన్లు మొయ్యటానికి అలాంటి పోర్టర్ని పిలిచినా, వాడిమీద తను అధికారం చెలాయించగలడు. దమాయించ గలడు. కూలి డబ్బులికి ఎడిపించి, వాడిచేత ‘‘సామీ’’ అనీ ‘‘సార్’’ అనీ అనిపించుకొని, తర్వాత కొంచెం జాలి కూడా ఒలకపోసి, వాడికో అర్ధణా ఎక్కువిచ్చి, తను మహా పెద్దమనిషిలా పోజు పెట్టగలడు కూడా. అంతగా కావలసివస్తే, ‘‘కూలీలు కూడా ‘‘తోటి మానవులే, మనకి సోదరులే’’ అని ఒప్పుకొని, వీళ్ళ తరఫున గేయం రాసి ‘‘అయ్యయ్యో! ఈ ఇలలో, అందరి గుండెలు శిలలో!’’ అని ఆనందించి వుండును.

కాని ఇప్పుడు పరిస్థితులు తారుమారయ్యాయి. ఆ పోర్టరే ఇప్పుడు పెద్దమనిషి హోదాలో వున్నాడు. ఓ రౌడీలాంటి వెధవ, తనని రౌడీ అనుకుని దబాయించి, అవమానించి తన్నబోయే సమయంలో ఈ పోర్టరు న్యాయం చెప్పి, ఈ రౌడీ వెధవ పొగ రణచగల పెద్దమనిషయ్యాడు.

సుబ్రహ్మణ్యం నిస్సందేహంగానూ, ధారాళంగానూ ఆ పెద్ద

మనిషి హోదాలో వున్న పోర్టరులో ఏకరువు పెట్టాడు—ఠ నెవరో, ఎక్కడినుంచొచ్చాడో, ఎందుకొచ్చాడో, మధ్యలో ఈ రౌడీరాస్కెల్ 'ఆయన' (పైకి వెళ్లవంటే ప్రమాదం!) తనని ఎలా దబాయిస్తున్నాడో చెప్పి, న్యాయం అడిగినట్టు చూశాడు.

పోర్టరు ఒక పెద్ద వేదాంతిలా మొహం పెట్టాడు. సుబ్రహ్మణ్యంలో కసి, పోర్టరు 'సైకాలజీ' ఎనలైజ్ చేసుకునగాని, ఆ పోర్టరు ఈలోగానే చిరునవ్వుతో తల వూపి, చిన్న కేకలంలా వెళ్ళిపోతున్నాడు. సుబ్రహ్మణ్యం నిరాశతో కూలిపోయి వాణ్ణి తిట్టుకుందుకు సిద్ధమయ్యాడు. కాని ఈ లోగానే రౌడీవెధవ దిగ్విజయం చేసొచ్చిన చక్రవర్తిలా నవ్వుతూ ఉపన్యాస ధోరణిలో మాట్లాడాడు.

"ఒరేయ్! జాగ్రత్త, చెబుతున్నా. రౌడీలాగ వచ్చి రాత్రి తొమ్మిది గంటలకి కొంప మునిగిపోయినట్లు సెంట్రల్ అంతా పరవళ్ళు తొక్కుతూ, అనుమానం పుట్టించేటట్టు తిరిగితే పోలీసు లేపను కోవాలిరా?....నువ్వు దొంగతనం చేశావో, ఖూనీచేశావో, ఎవడికి తెల్సు? ఇంటి కెళ్ళు....నువ్వు చెప్పిన ఎడ్రసుకు వచ్చి చూస్తా తర్వాత. ఆ పైన నీ పని చెప్తా. ఊఁ నడు!" అని.

సుబ్రహ్మణ్యం అమాంతంగా తన గూడకట్టూ, స్టయిలిష్‌గా మడత పెట్టిన పొడుగుచేతుల చొక్కా, కాలర్ క్రింద జేబురుమాలు, లవ హైరోడ్డు క్రాపూ పూర్తిగా జ్ఞాపకం చేసుకుని, కొంతసేపు తను రౌడీ అనుకున్నవాడు సి. ఐ. డి. అని ఊహించి నెలాఖరు రోజుల్లో ఎలాగో ఓలాగు కేసులు పట్టాలని చూసే పోలీసు కళ్ళలో, తను అప్పుడు వేసుకున్న బట్టల్లో తనకెంత కల్చర్ ఉన్నా, తెలివితేట లున్నా, తను ఎటువంటి పోకిరీవా డనబడడానికి అవకాశా లున్నాయో ఊహించుకుని ఆ కారణాలవల్ల వాడు తనకి అప్పుడు చేసిన మర్యాద బహుశా సమంజసమేమో అనే నిర్ధారణకి వచ్చేసరికి స్టేషన్‌వదలి ట్రామ్‌రోడ్డుదాటి బస్సుస్టాండులో ఒణుకుతున్న కాళ్ళతో, ఉధృతంగా కొట్టుకునే గుండెల్తో, బెదిరే చూపుల్తో నిల్చున్నట్లు తెల్సుకున్నాడు. టైము తొమ్మిదిగంటల ఇరవై నిమిషా లయింది.

మైలాపూరు ట్రాములు అయిపోయాయిట. ఇక బస్సులు మాత్రమేట. వాటికీ రద్దీగానే ఉంది.

సుబ్రహ్మణ్యానికి మంచి దూరాలోచన వుంది.

తనకి బస్సులో చోటు దొరికేసరికి ఆలస్యం అవొచ్చు.రద్దీతో తోసుకుంటూ ఎక్కితే, ఇందాక తన్ను రౌడీ అనుకున్న పోలీసుగాని తన్ను చూస్తే పిక్‌పాకెట్ ప్రయత్నాలు చేస్తున్నానని పట్టుకొని కసి తీరా రెండు తగిలించొచ్చు. లేదా తను చోటు దొరికేదాకా వెయిట్ చేశాడా, "ఇక్కడే కాచుకున్నావుట్రా! ధామస్‌కోసం. దొంగవె...." అని మళ్ళా వ్యవహారం మొదటికి తెచ్చి పోలీసువారి ఆఫీసులో నైట్‌డ్యూటీ వెయ్యొచ్చు.

అంచేత వాడు ఈ ఏర్పాట్లు చేయడానికి వచ్చేలోగా తను నడక సాగించి బ్రిడ్జి దాటిపోతే ఫరవాలేదు. జనం నడుస్తూనే వున్నారు.

సుబ్రహ్మణ్యం నడుస్తున్నాడు. కాని బ్రిడ్జి ఎక్కి దిగేవరకూ కూడా తన వెనకాలే వచ్చి బాగా పొడుగ్గా అయిపోయి ఫేడవుటయి పోయే ప్రతినీడా ఇందాకటి పోలీసు పెధవదే అనుకున్నవాడై తల ప్రక్కలకి తిప్పడానికి కూడా జంకుతున్నాడు.

ఇలాంటప్పుడు పాటపాడ్డం బెస్టుకాని, ఒకటీ మంచిది జ్ఞాపకం రాదు. . ఒకటి వచ్చినా దాని వరస జ్ఞాపకం రావటంలే. అసలు ధ్వనే బయటకు రావటంలే.

పాట రాని సందర్భంలో ఈలవేస్తే బాగానే ఉంటుందని తోచివుండవచ్చు. నోరు ముందుకు పెట్టి ఈల వెయ్యబోయేంత పని చెయ్యబోయాడు. కాని, వెనకాల తరిమే నీడ పోలీసువాడి దయ్యంటే వాడు తన్ని, బహుశా అనుమానించి దబాయించవచ్చు - థామస్‌ని పిలిచేందుకు ఈ ఈల ఒక గుర్తని. వెంటనే ఈలవేసే కార్యక్రమం పూర్తిగా ఉపసంహరించుకుని, ఏం చేయాలో తోచని పరిస్థితిలోకి వచ్చేశాడు సుబ్రహ్మణ్యం....

ఇంతలో "మిలియన్స్ యూజ్ ఇట్ డెయిలీ" అని భూగోళం బద్దలుగొట్టేట్టరిచింది ఎదురుగుండా సబ్బు ఎడ్వర్‌టైజ్‌మెంట్

జోస్టి. సుబ్రహ్మణ్యం ఆగి నవ్వాడో, నవ్వి ఆగాడో కాని, మొత్తానికి ఆగాడు. "అయితే, ఇంత పెద్ద అరుపు లెంపకోయ్! మిగిలిన కొంచెంమంది కోసం" అనుకొన్నాడు.

ఈలోగా, ఇందాకటినుంచీ తన వెనకాలే తరుముతున్న పీచ తాటాకు ఆసామీ దాటిపోయాడు. ఇదే సుబ్రహ్మణ్యం కోరింది. ఇందుకే అతను ఆగడం, నవ్వడం, విమర్శించడం - అన్నీని. తను 'రౌడీ' అనుకున్న పోలీసువాడు తనను తరమటం లేదన్నమాట. ఓ మాటు వెనక్కి ధైర్యంగా చూశాడు.

పదిఅడుగులు వేసేసరికి ధైర్యం ఎక్కువయింది. ఎందుకంటే తనకన్నా రౌడీల్లా కనబడే వాళ్ళంతా వస్తూపోతూ వున్నారు. ఇప్పుడు గాని ఆ పోలీసువచ్చి దబాయించాడా, సుబ్రహ్మణ్యం చెయ్యబోయే మొదటిపని - వాణ్ణి ఈడ్చి లెంపకాయ కొట్టడమే.

సుబ్రహ్మణ్యం నడక సాగించాడు ముందుకి.

మనస్సు వెనక్కెళ్ళింది సెంట్రల్‌కి ... ....

తొమ్మిదిగంటలవుతూ వుంటుంది.సుబ్రహ్మణ్యం పారిపోయిన తమ్ముడికోసం గబ గబా, కంగారుగా సెంట్రల్‌లో పరవళ్ళు తొక్కుతూంటాడు.

"డేయ్"

సుబ్రహ్మణ్యం వెంటనే వెనక్కి తిరుగుతాడు.

"థామస్ కోసమేనా నువ్వు వెతికేది?"

సుబ్రహ్మణ్యం జవాబివ్వడు. పైగా తన్ని 'ఒరేయ్' అని పిలిచినవాణ్ణి ఎగాదిగా చూస్తాడు. 'నీకేమన్నా ఒళ్లుపై తెలుస్తోందా?'' అంటూ.

వాడు సుబ్రహ్మణ్యం చొక్కా కాలర్ పట్టుకొని గుంజుతాడు, ఏదో అరవంలో వాగుతూ—

'ఛప్' మని లెంపకాయ కొడ్తాడు సుబ్రహ్మణ్యం వాణ్ణి. వాడు పడిపోతూవుంటే. వాడి కాలర్ పట్టుకుని ఆపి, మళ్ళా రిపబ్లిక్ సీరియల్స్‌లో హీరోలాగ గడ్డంకింద ఒక్క 'నాకౌట్' ఇస్తాడు. వాడు దూరంగావున్న స్తంభానికి కొట్టుకుని కిందపడతాడు. ఎదా పెదా

ఇంకో నాలుగు వాయించి, జుట్టు సర్దుకుంటాడు సుబ్రహ్మణ్యం. జనం గుంపుగా చేరి చూస్తూవుంటారు.

సుబ్రహ్మణ్యం, తన కారుడ్రైవర్ని పిల్చి, అప్పుడే అక్కడి కొచ్చిన పోలీసువాణ్ణి చూపించి అవసరమైతే తన యింటికి రమ్మని చెప్పి రక్తంలో పడివున్న మొదటి పోలీసుని చూచి, తలాడించి కారు డ్రైవ్ చేసుకుని ఇంటికి పోతాడు.

ఉలిక్కి పడ్డాడు సుబ్రహ్మణ్యం. సరిగ్గా అరక్షణం క్రితం ఘాతంలాంటి ఏదో తిన్ని మాసుకు పోయింది. పెద్ద అరుపుతో. రోడ్డు మధ్యనుంచి ప్లాట్‌ఫారంపైకి వచ్చాడు ...

ఎలాగైనా మరీ ఇంత కఠినశిక్ష అనవసర మనిపించింది. తన్ని వాడెంత అవమానించినా తను అలా కొట్టి వుండకూడదు వాణ్ణి. సుబ్రహ్మణ్యానికి పోలీసువాడిమీద చాలా జాలేసింది........అబ్బే! ఈ శిక్ష బాగులే........

సినిమా ఎడ్వర్టయిజ్‌మెంట్ బండీ తోసే కుర్రాడు బండీని పక్కగా ఆపి, దాంట్లో దూరి కూచుని బీడీ కాలుస్తున్నాడు.

నవ్వొచ్చింది. ఈ కుర్ర వెధవలు పగలూ ఇంతే. ఓ మూల ఆపేసి దాంటో పడుకుంటారు....అయినా ధియేటర్ వాళ్ళిచ్చే కూలికి చాలీ సేవ....

హఠాత్తుగా మిష్టర్ సుబ్రహ్మణ్యం దృష్టి ఆ బండిమీది పోస్టర్‌మీదవున్న హీరోయిన్ బొమ్మమీద. ఇంకా కరెక్టుగా కావాలంటే ఆ బొమ్మలో వుద్రేకజనకంగా డిజైన్ చేసిన వక్షోజాలమీద పడింది. సుబ్రహ్మణ్యంలో కవి సినిమాలవారు సెక్సుని ఎంత ఘోరంగా ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నారో, ఎంత అవినీతిని రేపుతున్నారో ఆలోచించి విమర్శించమనుగాని, క్షణంలో అతని శరీరం స్వతంత్రం తీసుకుంది. నరాలు స్వాధీనం తప్పాయి, మనస్సు మత్తెక్కింది. ఒళ్ళంతా ఒక్క తీయటి తలపుతో జలదరించి, వెంటనే బిగుసుకుపోయింది. దృష్టి కొంచెం మందగించింది. వెంటనే నోరు బిగించుకుపోయి నాలుక బెరడు కట్టింది. గుండెలో ఒకశూలం

గుచ్చుకుని ఆ తియ్యని నొప్పి ఒక కెరటంలా వెన్నెముక చివర కంటా విరిగింది.

ఈ సరికి అతడు సరిగ్గా సినిమాపోస్టరు ప్రక్కనే నిలిచాడు. ఒక్క మాటుగా అతనిలోవున్న కామప్రవృత్తి ఉవ్వెత్తున మహోన్నత కెరటంలా లేచింది. సముద్రోద్భూత జ్వాలవలె ఒక అగ్ని ప్రజ్వరిల్లింది. కాని అది ఎంతటి చల్లటిమంట!....సుబ్రహ్మణ్యం ఇటూ అటూ చూశాడు. దగ్గర్లో ఎవరూలేరు, బండి కుర్రాడు కునుకు తున్నాడు. వెంటనే అతను ఎడంచెయ్యి వేళ్ళు పోస్టర్‌మీది బొమ్మ వక్షోజాల మీదుగా పోనిచ్చి చెయ్యి అలా బండి చివర వరకూ రాసు కుంటూనే నడిచాడు. మూడు క్షణాల్లో బండి దాటిపోయాడు. తుఫాను చల్లారింది....ఈ కొత్త ప్రశాంతంలో అతను చల్లగా నడిచాడు....

రాత్రి పదకొండప్పుడు—అంటే రోడ్డుమీద జనం లేనప్పుడు. అటూ ఇటూ ఎలెక్ట్రిక్ దీపాలు. బద్ధకంగా నిల్చుని మత్తుగా కిందకు చూస్తున్నాడు. ఇలాటిపిల్ల ఒంటరిగా ఎదురొస్తే....సుబ్రహ్మణ్యం గుటకలు మింగాడు.... ఆ పిల్లని దగ్గరగా రానిచ్చి గబుక్కున కావలించుకుని గట్టిగా ముద్దెట్టుకుని తిరిగి హఠాత్తుగా వదిలేసి పరిగెత్తు కుని పోవచ్చుతను....ఆ! తనకా ధైర్యం వుంది. బహుశా ఇష్టం కూడా వుండొచ్చు. కాని, పైకి చేస్తే నలుగురూ చీవాట్లుకూడా వెయ్యొచ్చు. మామూలుగా మనిషైన ప్రతివాడూ అంతేనేమో. అధమం, అంత పనిచేసే ధైర్యం లేకపోయినా ఆ ఆలోచన తప్ప కుండా వస్తుంది. కాని, నిజం ఒప్పుకోడు. ఒప్పుకుంటే వాడువెధవ, పోకిరీ, రౌడీ.

తనిలాగ మహా 'సైకోఎనలిస్ట్' లాగా ప్రజా బాహుళ్యపు నైతిక విలువలు కొలవడం, ప్రజల మనస్తత్వపరిశీలనకు పూనుకోడం డం, అందులో ముఖ్యంగా ఇలాంటప్పుడు ఏమీ బాగా లేదనిపించింది. ఏదో కమ్మగా ఆలోచించుకుంటూ పోతే కాళ్ళనొప్పి తెలియదు.... అసలు—అంటే ఒకవేళ ఆవిధంగా ఒక అమ్మాయే అలాంటి సమ యంలో ఎదురవడం తటస్థిస్తే....

వెంటనే ఇంకో ఆలోచనకూడా సుబ్రహ్మణ్యం బుర్రలో తటస్థించింది. 'అంతా కలిసొచ్చి, అమ్మాయి ఎదురొచ్చి. తను ధైర్యం చేయబోయే సమయంలో ఇందాకటి (స్టేషన్‌లో) పోలీసు వాడు అక్కడ ప్రత్యక్షమవడం తటస్థిస్తే....''

''ఛీ 'రొమాన్స్' అంతా పాడైపోయిం' దనుకున్నాడు సుబ్రహ్మణ్యం. ఆ కోపంలో శ్మాష్‌డ్, డిస్ట్రాయిడ్, క్రష్‌డ్ అనే మూడు ఇంగ్లీషుపదాలు జ్ఞాపకం వొచ్చాయి. ఈమూడూ 'ఎమ్‌ఫాటికల్'గా తనలో తానే ఉచ్చరించుకున్నాడు. ఈ గొడవలో ఎదురుగా ఉన్న 'కీప్‌లెఫ్ట్' బోర్డుని పరాకుగా చదివేసి, ఆ ఆజ్ఞని మన్నిస్తూ మలుపు తిరిగాడు. మలుపు తిరుగుతూ తనుచేసిన పొరబాటు గ్రహించుకుని వెకిలిగా నవ్వుకున్నాడు. ఎవరైనా విన్నారేమో అని అటూ ఇటూ చూశాడు ...

హిందూదినపత్రిక ఆఫీసుదగ్గరికి చేరుతూండగా పోలీసుకారు వలభై మైళ్ళ స్పీడులో పోతూంది సెంట్రల్‌వేపు. అందులో సర్కిల్ గారూ, ఓపోలీసూ ఉన్నారు. సుబ్రహ్మణ్యం ఆగాడు-''హుం! వీళ్ళు మట్టుకు ఇంత వేగంగా పోవచ్చు గామోసు?''

సుబ్రహ్మణ్యం నడక ఇంటివేపు సాగించాడు. హఠాత్తుగా మనసు సెంట్రల్‌కేసి వెళ్తున్న పోలీసుకారును అందుకుంది.

• • •

తొమ్మిది దవుతుంది. మిస్టర్ సుబ్రహ్మణ్యం సెంట్రల్ స్టేషనులో పారిపోయిన తమ్ముని కోసం హడావుడిగా వెతుకుతూ వుంటాడు.

''థామస్ కోసమేనా నువ్వు వెతికేది?'' అని పోలీసువాడ్డి దబాయిస్తాడు. సుబ్రహ్మణ్యం మర్యాదగా మాట్లాడతాడు కాని, వాడు మాత్రం సుబ్రహ్మణ్యం ఎడ్రసు తీసుకొనికూడా నమ్మక అవమానించి పొమ్మంటాడు.

మిస్టర్ సుబ్రహ్మణ్యం అవమానించబడిన హృదయంతో ఇంటి కొస్తూంటాడు.

మౌంటురోడ్డులో పోలీసుకారు ఎదురై ఆగుతుంది. "హలో గుడ్ ఈవినింగ్ మిస్టర్ సుబ్రహ్మణ్యం" అంటూ కారులోనుంచి సర్కిల్ ఇన్‌స్పెక్టరు దిగుతాడు కాని, సుబ్రహ్మణ్యం కొంచెం చిరాగ్గా మాట్లాడతాడు "ఏమిటి సార్? మీ పోలీసుల కేమీ మర్యాద తెలియదు. నేనిందాకా సెంట్రల్ కెళ్తే ఎవడో సి.ఐ.డి. తగులుకుని నన్ను రౌడీ అంటూ దబాయించాడు. బొత్తిగా అంత తేడా తెలియదండీ వాళ్ళకి"

సర్కిల్ చాలా ఆశ్చర్యపోతాడు. "మిమ్మల్నా సార్! వాడు రౌడీ అంటా? పదండి సెంట్రల్‌కి? వాడిసంగతి కనుక్కుందాం."

సుబ్రహ్మణ్యమే కారు నడిపాడు దారిలో తనోప్లానుచెప్పాడు సర్కిల్‌కి. అలాగైతే వాడిని "రెడ్ హేండెడ్"గా పట్టుకోవచ్చు. సుబ్రహ్మణ్యం ప్లాను విని సర్కిల్ ఆశ్చర్యపడ్డాడు. అందుకు నిదర్శనం ఆతడు గట్టిగా 'వండర్‌ఫుల్, సుపెర్బ్, మార్వెలస్' అనే మాటా, ఇంచుమించు అంతే అర్థం సూచించేవి ఇంకోరెండూ వెరసి మొత్తం ఐదు ఇంగ్లీషు మాటలు ఉపయోగించటమే.

కారాపి సుబ్రహ్మణ్యం ఒక్కడూ ముందర వెళ్ళి హాల్లో ప్రవేశిస్తాడు.

(ఇక్కణ్ణించి జరగబోయేది సర్కిల్ దాక్కుని చూస్తాడన్న మాట.)

ఇందాకటి రౌడీ మళ్ళా వస్తాడు. సుబ్రహ్మణ్యం చొక్కా పట్టుకొని, "ఏరా మళ్ళీ వచ్చావ్? నువ్వసలు వచ్చిన పని చెప్పు. ఏదో అడ్డ పిచ్చి దబాయిస్తావూ? దొంగ వెధవా ..."

సుబ్రహ్మణ్యం హఠాత్తుగా వాడి చెయ్యి విసిరికొట్టేస్తాడు. పైగా యిలా అంటాడు-"ఏమిటోయ్, నా కిష్టం వచ్చినన్నిమాట్లు నేను సెంట్రల్‌కి వస్తా. నువ్వేమిటి? వెధవ దబాయింపూ నువ్వూను.. మా సర్కిల్‌కి రిపోర్టు చేస్తా, జాగ్రత్త,"

'రౌడీ' లేక సి. ఐ. డి. చిన్నసైజు విలన్‌లాగ నవ్వుతాడు. "ఏడిశావ్! నువ్వు రిపోర్టు యివ్వడం, సర్కిల్ నమ్మటం ....దిక్కున్న చోట చెప్పుకో. సర్కిల్ కాదు వాడి బాబుతో చెప్పుకో."

హఠాత్తుగా స్తంభం పేల్చుకొచ్చిన నరసింహావతారంలాగ సర్కిల్ స్తంభం చాటునుంచి బయటి కొస్తాడు— "దేవుడే షణ్ముగం" అంటూ.

షణ్ముగం (సి. ఐ. డి.) వెనక్కి తిరిగి నీరుకారిపోతాడు. సుబ్రహ్మణ్యం గుండె ఆనందంతో ఓట వేస్తుంది. ఒక్కమాటుగా షణ్ముగం, సుబ్రహ్మణ్యం యిద్దరూ ఏదో చెప్పబోతారు. సర్కిల్ నవ్వుతూ "ఇంకేం చెప్పనక్కర్లేదు-అంతా నే చూశాను. షణ్ముగం, నీ ఉద్యోగం నిలబడాలంటే నువ్వు ఏ పనేనా ఆలోచించి చెయ్యాలి. ఆయన రౌడీయో, పెద్దమనిషో తెలుసుకోలేని నువ్వు 'సి. ఐ. డి.' పనికి పనికిరావు. నిన్ను రేపట్నుంచీ సస్పెండు చేస్తా."

షణ్ముగం కొయ్యబారిపోయి దీనంగా సుబ్రహ్మణ్యం కేసి చూసి క్షమార్పణ కోరుతాడు. తన దగ్గర సిద్ధంగా ఉన్న కొద్దిపాటి మర్యాద వాంఛల్ని ఉపయోగించి.

సుబ్రహ్మణ్యం అమాంతం దయా స్వరూపుడు అయిపోయి, శిబిదధీచులను జ్ఞప్తికి తెచ్చుకొని, "పోన్లెండి, ఈ మాటుకొది లెయ్యండి" అంటాడు సర్కిల్‌తో. "సరే, ఈయనే ఊరుకున్నారు కాబట్టి కాని .. " అంటూ సర్కిల్ ఓ చూపు చూసి, "రండిసార్, మిమ్మల్ని ఇంటి దగ్గర వదిలేస్తాను" అంటూ సుబ్రహ్మణ్యాన్ని కారులో ఎక్కించుకుపోతాడు.

* * *

పెద్దగోల, హడావుడికి సుబ్రహ్మణ్యం మనస్సు సెంట్రల్ నుంచి ఎగిరి వెనక్కొచ్చేసింది....

ఎదురుగా 'ఎల్ఫిన్‌స్టన్' హాలు దగ్గర పావలా అర్ధణా టిక్కెట్టు దగ్గర పోలీసులు లాఠీచార్జి చేస్తున్నారు, జనాన్ని అణచలేక. మళ్ళా కోపం వచ్చింది సుబ్రహ్మణ్యానికి, పోలీసుల మీద. ఇందాకా వాడిది వూహాలో కూడా క్షమించనంత తప్పనిపించింది. ఇంతసేపూ తన శత్రువుని శిక్షించింది తన ఊహాప్రపంచంలోనే అని గ్రహించుకుని, తన అశక్తతని తల్చుకునేసరికి అతనికి కంట నీరు తిరిగింది.

ఎదురుగా థియేటరు కప్పు మీద నుంచున్న 'రెండాల్ఫ్ స్కాట్' రెండు రివాల్వర్లు పట్టుకుని, అమోఘమైన పోజులో చూస్తున్నాడు కిందికి.

రూపాయి పావలా టిక్కెట్టు కొని సుబ్రహ్మణ్యం ఆ సినిమాకి వెళ్ళాడు, తన పాత శత్రువుకు కొత్త శిక్ష ఎలావెయ్యాలో సినిమా చూస్తూ ఆలోచిద్దామని. ఇంకో కారణం కుడా వుండొచ్చు. తన తమ్ముడిని వెతికేందుకు ఉపాయాలు ఆలోచించటానికి.... బహుశా ఇంకో ముఖ్య కారణమూ వుండొచ్చు. అతడది మీకూ నాకూ ఏనాటికీ చెప్పడు ...తను పొందిన ఇన్ని అవమానాలకన్నా సెంట్రల్ స్టేషన్‌లో ఒకే ఒక క్షణంపాటు తను చూసి, షద్దంగా చదువుకున్న ఆంగ్లోఇండియన్ అమ్మాయి వంపులు, రోడ్డు పక్కగా తను చూసిన పోస్టర్ హీరోయిన్ వంపులు అతని బుర్రనిండా ఆలోచనల్ని కల్పించి, తీరని కోరికల్ని రేకెత్తించాయి. ఇప్పుడీ సినిమా హీరోయిన్ వంపులు గంటన్నర చూసి, ఇంటికెళ్ళినప్పుడతడు తిరిగి ఇంకో రంగు రంగుల ఊహాలోకంలో ప్రవేశించవచ్చు. తీరని కోరికల్ని తృప్తిపరచుకుందుకు.... ...

———

# 7

# ఏకలవ్యుడు

"పది" అంది వకీలుగారింటి గడియారం.

"కాదుస్మీ" అంది పక్క వాటాలో మేష్టరుగారి గడియారం.

*        *        *

ఆ రాత్రి పదిగంటల వేళ ఈ విధంగా, పదీ అయిందని రైల్వే గడియారాలూ, కాలేదని రేడియో గడియారాలూ అభిప్రాయ పడుతున్నాయి. పురోగమనం అంటే మరీ ఇదయ్యే చిల్లర గడియారాలు గంటక్రితమే పదికొట్టేసి, పన్నెండవడానికి సిద్ధంగా ఉన్నాయి.

షికారు కెళ్తానని చెప్పి రెండో ఆట సినిమా చూసి వచ్చిన పురుష పుంగవులు, కలత నిదురలో లేచి తలుపు తెరిచిన నెలతల మనులేతబుగ్గల పౌడరు పొరమీద తేలిగ్గా చిటికవేసి, 'ఏడున్నరకే పడుకున్నావేం, తలనొప్పిగా ఉందా' అని కుశలం అడుగుతూ బుకాయించి తమకు ఆకలిలేని వైనాన్ని వెల్లడించి, పునరుద్ఘాటించి హాహావుడిగా నిద నటిస్తున్నారు.

గోదావరీ తీరాన సీరియల్ విరహగీతాలాపన సహా బాధ పడిపడి, మిగతాది భోంచేశాక అని స్థిమితపడి, ఆ వేళకే ఇల్లుచేరిన రోమియోలు పొంగిపొరలే వేదననీ, అమ్మపెట్టే చివాట్లనీ, ఎదురు గుండా కంచంలో ఉన్న పొడిమెతుకుల్ని కలిపి దిగమింగుతున్నారు.

*        *        *

'పదె' అంది వకీలు సుబ్బారావుగారి గడియారం.

"సరిగ్గా ఈపాటికి సీత హైదరాబాద్‌లో పడుకోబోతూ ఉంటుంది" అనుకున్నాడు— సీత వైనంవినీయం కంపతాపడ్డిన గురునాథరావు.

"ఇంకాక కాదు. ఇప్పుడే పది అయింది" అంది గురునాథ రావు పడుకున్న గదిలో గడియారం, చేతనైనంత గంభీరంగా. 'హుఁ' అనుకున్నాడు గురునాథరావు గట్టిగా.

పక్కవాటాలో ప్లీడరు సుబ్బారావుగారికీ ఇక్కడ గురునాథం తండ్రి రామనాథంగారికీ అభిప్రాయ భేదాలున్నాయి. కాబట్టి స్వామి భక్తిగల వారి వారి గడియారాలూ, రోజూ రాత్రి పదిగంటలవేళ లాంఛనానికి విభిన్నాభిప్రాయాలు ప్రకటిస్తాయి.

ఇలా విభిన్నాభిప్రాయాలు గలవారు ఇరుగూ పొరుగులుగా ఉంటూ శాంతియుతంగా సహజీవనం చేయవచ్చునని, ఆమాట కొస్తే, చేసి తీరాలని నమ్మినవాడు గురునాథరావు. అందులోనూ, ప్రక్క వాటా వకీలుగారి కూతురు ఇవతలి వాటాలో పెళ్ళికాని పిల్లాడి హృదయాన్ని అపహరించి అట్టేపెట్టుకున్నప్పుడు మార్గాంతరం లేదు.

అయితే, ఈ సహజీవనం ఏర్పాటుమీద గురునాథరావుకి ఎంత గురివున్నా ఆ క్షణాన, ఇరుగుపొరుగు గడియారాలు రెండూ వెరో అభిప్రాయం ప్రకటించడంతో కొంత ఒళ్ళు మండిపోయింది.

ఏ క్షణాన సీత హైదరాబాద్‌లో పడుకొనిఉంటుందీ అన్న విషయం సందిగ్ధంగా ఉండిపోయింది. ఇంకో క్షణానికి. అది అతని పాలిట జీవత్ మరణ సమస్య అయిపోయింది.

కాలేజీలో ఓ ప్రేయసి, గుడిప్రక్క మేడమీద ఓ జూలియట్, గోదావరొడ్డుకి షికారుకెళ్లే వారిలో ఓ సుందరి ఇలా ప్రేయసీమణుల జాబితా వేసుకొని, ఎవరేనా ఊరువెళ్ళితే తాత్కాలికంగా ఆ ఖాళీ భర్తీచేయడానికి విడిగా "స్టాండ్‌బై" (ప్రత్యామ్నాయ ప్రేయసీ మణులు)ల జాబితా హమేషా సిద్ధంగా ఉంచుకొని, ప్రొబేషనరీ జూలియట్ల లిస్టు వేరే తయారుచేసుకున్న వాళ్ళకి ఈ "ఏకలవ్యు"డి కష్టాలు బోధపడవు.

అవకాశవాది అభిప్రాయాలలా, క్షణానికో ప్రేయసిని మార్చు కునే వీళ్ళకి ఈ సమస్య, దొత్తిగా అమావాస్యలా మాసరేఖా రహితం గానూ, పిరికివాడి అభిప్రాయంలా అయోమయంగానూ, ఎన్నికల వాగ్దానంలా అసంగతంగానూ కనబడుతుంది.

హైదరాబాద్‌లో ఒక సీత ఎన్ని గంటలకి నిద్రపోతే ఏమొచ్చె అని హేళనచేసి తేలిగ్గా కొట్టిపారేస్తారు

కాని గురునాధరావు నికార్సైన "ఏకలవ్యుడు." సీతని చూశాడు, ప్రేమించాడు. ఇంకెవరినీ చూడలేదు. చూసినా ప్రేమించ లేదు.

'సీతే నా జీవితం' అనుకున్నాడు.

'సీతే నా జీవితగీతి' అని తరువాత ఓ ప్రేమ గీతం వ్రాశాడు. బాగుండలేదంది సీత. సరేనని చింపేశాడు గురునాధం.

ఆ తరువాత ఎన్నాళ్ళయినా అతడు సీతనే ప్రేమించసాగాడు (పాటలు వ్రాయకుండా). కాలేజీలో చాలమంది అతన్ని లోకువకట్టి, 'ఏకలవ్యుడు' (ఒకే ప్రేయసిగలవాడు) అని పేరు పెట్టారు.

అయినా గురునాధరావు ఈ వ్రతం ఉల్లంఘనకి వడికట్టలేదు. అందులో కొన్నాళ్ళాయి, సీత, పక్కవాటా అమ్మాయి అయింది

సీత కాఫీతాగడం ఆలస్యం అయితే, ఆ సంగతి తెలియక పోయినా, ఇవతలి వాటాలో గురునాధరావుకి రకీమని తలనొప్పి వచ్చేది, అతనికి తలనొప్పి వచ్చిన తక్షణం సీత కాఫీ తాగేసేది, తెలియకుండానే.

అందువల్ల, సీత హైదరాబాద్‌లో ఆ రాత్రి ఏ పది గంటలకి పడుకుని ఉంటుందన్న విషయం తెగని సమస్య అయిపోయింది. ఇండియన్ స్టాండర్డ్ టైము తెలిస్తే బాగుండు ననిపించింది.

అందువల్ల ఆ రాత్రి పదిన్నర ప్రాంతాల్లో ఎవరో హఠాత్తుగా దబదబ తలుపుకొట్టడంతో "ఇండియన్ స్టాండర్డ్ టైం ఎంతో నాకు తెలియచెప్పడానికి సీత పంపిన మాత కాబోలు" అన్న అభిప్రాయంతో గురునాధరావు చెంగున గంతువేసి పరుగెత్తి తలుపుతీసి, "ఎంత?" అన్నాడు అర్జెంటుగా. తలుపవతల నిలబడిన నల్లటి, సన్నపాటి చిన్న

సైజు శాస్త్రి దోట్లుసిగ్గు పడిపోయి, తలక్రిందులై పోయి, సంతోషం ఆశ్చర్యం నటించి "మూడున్నరకాలు ఇప్పటికి" అంది టూకీగా.

మూడున్నరేమిటని గురునాథరావు తృళ్ళిపడి కళ్ళు విప్పార్చి చూశాడు-"ఛీ, సిగరెట్లా కూడా లేవుంది. లేవన్న సంగతి తెలియకుండా ఇలా రాత్రి మూడున్నర దాకా సీత గురించి ఔంగెట్టు కుంటున్నాను కాబోలు" అనుకుంటూ.

ఐతే ఉత్తర క్షణంలో, ఎదుట కనబడ్డ శాస్త్రికి, సీత పంప తగు దేవదూతకీ పోలికలేం కనబడలేదు గురునాథానికి.

"హోరి నువ్వుట్రా!" అన్నాడు.

"కాదు మరీ, పూర్తిగా నేనే, కేవలం నేనే!" అన్నాడు తుకారాం వినమ్ర భావంతో, మందంగా హాసిస్తూ.

గురునాథం గబుక్కున తలుపు గడియ వేసేయబోయాడు.

కాని దూర దృష్టిగల తుకారాం అప్పటికే తలు పివతల ఓ కాలు పెట్టేశాడు.

"మూడున్నర కాకపోతే రెండున్నర చాలులే" అన్నాడు.

"అణన్నర కూడా ఇవ్వను" అన్నాడు గురునాథం.

"నువ్వేగా, ఎంత కావాలని మహా భోజరాజు పోజుల్లో అడిగావు: పోనీ అణాయేనా ఇయ్యి, టీ తాగిపోతాను" అన్నాడు తుకారాం, గురునాథం జేబులో సిగరెట్లు తీసుకుంటూ.

"దమ్మిడీ కూడా ఇవ్వను ... నే నడిగింది టైమెంత అని."

"బ్రదర్! నీ ఎడం గుండెలో హార్టేమయింది? . ఇంత కర్కశంగా మాట్లాడుతున్నావే! నీ హృదయం ఏమయిపోయిందీ అంట" అన్నాడు తుకారాం విస్తుపోయి.

"నా హార్టిక్కడ లేదోయ్. హైద్రాబాద్ వెళ్ళింది" అన్నాడు గురునాథం చిరాగ్గా.

"ఓస్ ఇంతే కదా! మళ్ళా ఎల్లుండి సోమవారం పొద్దున్నే ఇక్కడ సిద్ధం అవుతుందిగా. అపుడు నచ్చ చెబుదుగానిలే. ఇప్పుడు ఆడిన మాట తప్పకు . నా సత్యవంతుడివిగాదూ....నా హరిశ్చంద్రుడివి గాదూ."

"ఇప్పట్లో. ఇక పది రోజుల దాకా రానంది సీతా ఇల్లు వస్తుందని ఎవరు చెప్పారు"

"తుకారాం న్యూస్ సర్వీస్‌వారు సరియైన సమాచారాన్ని సరసమైన ధరలకే విక్రయించెదరు" అన్నాడు తుకారాం.

"అక్షర లక్ష లిచ్చేస్తాను. త్వరగా చెప్పు బాబూ."

"అబ్బే, మాట కబా, లేక ఆరు పైసాలు ఇస్తే చాలు. వెళ్ళి బోసెడబాకాసులు పట్రా. ఒక్కోటీ వేద్దుగాని" అన్నాడు తుకారాం

* * *

పై విధంగా పావలక్కువ మూడు రూపాయలు పెట్టి గురునాథరావు కొనుక్కున్న సమాచారం సారాంశం, మూడోనాటి కల్లా సీత హైదరాబాద్ నుండి తిరిగి రాబోతున్నదని.

"ఏం, ఢిల్లీ వెళ్ళదా మరి? కొంపదీసి—" అన్నాడు గురునాథరావు.

"రైట్. సరి. కరెక్టండి. అక్షరాలా నిజమండి. మీ కాబోయిన మామగారు అనాలనుకొన్న మినిష్టరు అవటం లేదండి "

గురునాథరావు ఉలిక్కిపడ్డాడు. "నీ వెనకాల చీకటి నిండా వేలాది శ్రోతలు క్యూలో నిల్చున్నా రేవిట్రా? ఎవడు వాడు?" అన్నాడు కంగారుగా.

"ష్! అప్పుడే కాదు. ఆగండి" అన్నాడు తుకారాం, చీకట్లోకి అభినయిస్తూ. ఆ అశరీరవాణి ఆగింది.

"మాటాడవేంరా" అన్నాడు గురునాధం ఉరుముతూ.

"....అదేనండి. మీరనుకున్నట్టే ...మీ మామగారికి మినిష్టరు ఛాన్సు రాదుటండీ .. అందుకేమో, ఢిల్లీ ఇంకెందుకని...."

"ఛస్, నోర్మూయ్యండి. మిమ్మల్ని కాదు, నన్నూ వాడు అడిగింది" అన్నాడు తుకారాం గట్టిగా. అశరీరవాణి మళ్ళీ ఆగిపోయింది.

"ఎవరు వారు?" అన్నాడు గురునాధరావు.

"వారి పేరు తెలిపతిరావుగారులే. పొలిటికల్ ఎక్స్‌పర్ట్.

తుకారాం న్యూస్ ఏజన్సీ డైరెక్టరు....బొనుగాని నేను అర్జంటుగా ఓ పనిమీద వచ్చాను. విను."

"నా దగ్గిర ఇంక డబ్బు లేదు. ఉన్నా ఇవ్వను."

"పోనీ. వద్దులే. నే వెళ్లేలోగా నీ మనసు కరిగి నీకై పోక పోతే ఇవ్వద్దులే. అవునుగాని, నాకొ్కంచెం షోగ్గా సంతకం పెట్టడం నేర్పగలవూ?" అన్నాడు తుకారాం.

"ఏం గిరాకీ. చెక్కు బుక్కు దొరికిందా?"

"ఇంకా లేదు. రేపట్నించి దారుణంగా డబ్బొచ్చేస్తోంది. న్యూస్సర్వీస్ పెట్టాం గదా మరి... దాని కోసం అని చెక్కులమీద సంతకం నేర్చుకోవద్దూ. అది మంచి దర్జాగా, ఎవరికీ అర్థం కాకుండా, నేను మళ్ళీ ఎప్పుడూ ఒక్కలాగే పెట్టడానికి వీలుగా ఉండాలి."

"అబ్బ, ఊహ బావుల్దికాని, శిద్దరొస్తాల్ది, పోయి పడు కుల్దారా, నీ సత్తకాల బాట దేవుకెరుగు" అన్నాడు గురునాధరావు బద్ధకంగా ఆవలిస్తూ.

'పదమూడు" అంది తలుపవతలి అశరీరవాణి.

"అబ్బబ్బ! అవి పేగులుకావు సార్" అన్నాడు తుకారాం విసుగ్గా....

"ఎవ్రా అది? ఏమిట్రా కధ?....ఇట్రమ్మను."

తుకారాం కొంచెం సిగ్గు నటించి, చీకట్లో శాస్త్రిని వెలుగు లోనికి లాగాడు.

"వీరి పేరు కొలిపతిరావుగారు. ఆవలిస్తే పేగు లెక్కెడతారు."

"ఎందుకూ? జబ్బా? హాబీవా?" అన్నాడు గురునాధరావు.

"కాదు వృత్తి, పొలిటికల్ ఎక్స్పర్ట్ దగ్గిర ఉండాల్సిన విద్య అదేగదా."

"ఆ, ఐతే ఇప్పుడు నాకు పదమూడు పేగులున్నాయంటారా సార్" అన్నాడు గురునాధరావు సగౌరవంగా.

"ఆయన బొంద! ఆయన అభిప్రాయాలకేంలే. అసలాయనికి తెలిసిన ఆవలిస్తే పేగులెక్కెట్టొచ్చునని. ఎవరో చెప్పారట. ఈయనేమో బొమ్మముకలు చూసి పేగు అనుకుంటాడు. ఒరేయ్.... మెడ మీద మెతక పడ్డట్టు అలా చూడకు. నేనేదో తిన్ని తిడుతున్నాననుకుంటాడు. చెప్తుంటే...." అన్నాడు తుకారాం సావాగా.

పెలిపతిరావుగారు ఎలక్షన్స్‌లో గెలిచిన వాడిలా వినమ్ర భావంతో మందహాసం చేసి గురునాథరావుకి నమస్కరించాడు. "నా మీద అభిమానంకొద్దీ వారలా నన్ను ఘనంగా ఎన్నిక చేస్తున్నారు, నమ్మండి. తుకారాం సర్వీసు అయిడియా ఆయనదే, కంపెనీ నాదిలెండి. హిహీ" అన్నాడు.

గురునాథరావు వీధిలోకి దృష్టి సారించి, "ఎవరండి" అన్నాడు హఠాత్తుగా. తుకారాం వెనక్కి తిరిగాడు కుతూహలంకొద్దీ.

రాజకీయ హంతకుడు సాటి నాయకుడిని కూలద్రోసే ఒడుపుతో, సుతారంగా, సున్నితంగా, మృదువుగా గురునాథరావు తుకారాంని గుమ్మం అవతలకి నెట్టేసి గబుక్కున తలుపువేసి గడియపెట్టి ఆవలించి 'హాౌ' అనుకుని, మంచం మీద పడుకుని సీత గురించి దెంగెట్టుకొంటూ నిద్రపోయాడు.

గడియారం మళ్ళీ గంటలు కొడుతూ ఉండగా, వీధి తలుపు చప్పుడైంది.

గురునాథరావుకి మెలకువ వచ్చింది కాని తలుపు కొట్టేది తుకారాముడే నన్న నమ్మకంతో కళ్ళు మూసుకు పడుకున్నాడు.

అందుకని వాళ్ళ నాన్నగారు లేచివెళ్ళి తలుపు తీస్తూనే, "అరె! మీరా? ఎప్పుడూ రావడం?" అన్నారు.

"డిసెంబరు ఇరవయ్యో తారీఖు పొద్దున్న. నాలుగు నెల్లాయి గుమ్మంలో నించుని తలుపు కొడుతున్నాం" అన్నారు సుబ్బారావు గారు గంభీరంగా.

"ఓరి బాబో! మినిష్టరై పోయినట్టే మాటాడుతున్నారే, బావ గారు!" అన్నారు రామనాథంగారు,

"ఏమిటి కథ? రకీమని జవాబిచ్చేశారే! ఇంక్రిమెంటుగినా తగిలిందా కొంపదీసి?" అని ఆశ్చర్యాన్ని అభినయించారు సుబ్బారావుగారు.

"ఇంకా అలాంటి ఉత్పాతం ఏదీ సంభవించలేదుగాని, మీరు పెద్దసైజు లీడరు అయే లోగానే మా టీచర్లకి జీతాలు పెరగడం మటుకు ఖాయంలెండి....కావలిస్తే రాసిస్తా" అన్నారు రామనాథం గారు పెళపెళ నవ్వుతూ.

"అలా జరిగితే నేను మంత్రి అయిన తక్షణం అవన్నీ రద్దు చేయించేస్తాను. ఆ ఇంక్రిమెంట్లేవో నా చేతిమీదగానే రావాలి."

"మరే. 'లేదు పొమ్మనడానికి కోడి లెవత్తి' అందిట వెనకటికో అత్తగారు"

దానికి రకీమని జవాబేంచెప్పాలో లాయరు గారికి తట్టలేదు.

రాగాలాపనలో పై షడ్జమం దాటిపోయి అక్కడేం చెయ్యాలో తోచక, దిగలేక నిలవలేక అవస్థపడే జూనియర్ గాయకుడిలా గింజుకోసాగాడు.

అంతవరకూ మాటాడకుండా, అలా మరచెంబూ సంచీ పట్టుకొని నిలబడ్డ సీత తక్షణమే "నాన్నా, నిద్రొస్తోంది, ఇంట్లో కెడదామా ఇంక" అంది.

"అయ్యో రామా! నీ సంగతే మర్చిపోయాను! నా కబుర్లో నేనూను! పదమ్మా పద, తాళం తియ్యి" అన్నాడు లాయరుగారు మహా సంతోషపడిపోయి మళ్ళీ లేచి.

క్లిష్టపరిస్థితులు వచ్చినపుడల్లా సీత ఆయన్ని ఇలాగే ఆదుకుంటుంది.

ఆయనకి కేసులు గెలవడం బోలెడు సరదా. కాని, గెలవడానికి కోర్టు కెళ్ళినా కేసులు దొరకవు. ఇంకెందుకని వెళ్ళడమూ మానేశాడు. అందుకని ఇంట్లోనే కూతురితోనూ, ఇరుగు పొరుగులతోనూ సూటిపోటి మాటల పోరాటాలు పెట్టుకుని, ఎదుటి మనిషి నోరు మూయించినపుడల్లా 'కేసుపోయింది' అని నవ్వేసి

మురిసిపోయే అల్పసంతోషి. ఈ తరహా కేసులు ఆయన తరచు గెలుస్తానే ఉంటాడు. ఓడేవి సాధారణంగా పక్కవాటాలో మేష్టరిగారి దగ్గరే. అసలు మేష్టర్లు ఈడురోమంటూ, దిగులుగా, ఎప్పుడుబతికావు అంటే ఏదోష్టం అయిందన్నట్లుగా వుండాలని ఆయన భావం. కథలు చదివి చదివి, అది మనసులో ఖరారు చేసుకొన్నాడు. రామనాథంగారు టింగు రంగామంటూ ఉండటం, మాటకు మాట బదులు చెప్పగలగడం ఎలా సాధ్యమో ఆయనకి బోధపడలేదు.

అసలు లాయరు సుబ్బారావుగారు ఆ యింట్లో అద్దెకు దిగిన కొద్ది రోజులకే, చనువుపేరిట అలుసు తీసుకుని. ఓరోజు పొద్దుటే "హా టీచర్స్! పూర్ క్రీచర్స్" అనేశారు. ఆ తరువాత "మీ జీతాలు దారుణం. ఎలా బతుకుతున్నారోగాని" అన్నాడు.

"ఏమేనండి పెద్ద మిష్టరీ....అయితే ఒక్క విషయం గమనించారా? మా జాతికి ఈ నెల కాపోతే పై నెలైనా వందకాపోతే యాభయ్యేనా చేతికందడం గారంటీ అండి" అన్నారు, మేష్టరు రామనాథంగారు నవ్వుతూ.

దానికి తకీమని కాదుగదా, ఇంకో నిమిషం తిరిగినా కూడా సుబ్బారావుగారికి జవాబు తోచలేదు.

'కేసు పోయింది,' అని రామనాథంగారు అనబోతూ ఉండగా, "నాన్నోయ్, కాఫీ" అని కేక పెట్టింది సీత వంటింట్లోంచి.

ఒక్క అంగలో వంటింట్లో పడ్డారు సుబ్బారావుగారు 'హమ్మయ్య!' అనుకొని.

"అబ్బ! ఎంతవేడి....నాన్నా! నీ కిప్పుడు మేష్టారంటే వాగా ఒళ్ళు మండుతూంది కదూ" అంది సీత నవ్వుతూ.

"ఔనమ్మా, మరీ పొగరుగా మాటాడతారు. అసలు మందే తప్పు. ఈ మధ్య తరగతివాళ్ళకి చనువిస్తే నెత్తికెక్కిపోతారు," అన్నాడు. అంటూనే ఆయనకి బ్రహ్మాండమైన ఊహ పోయింది. కూతురి మాటలు సాంతం వినకుండానే, మళ్ళీ ఉమ్మడి సావిట్లోకి వెళ్ళాడు.

"అప్పుడే కాఫీ తాగేశారండీ!'' అన్నారు రామనాధంగారు. ఆయన కొత్తలో కొన్నాళ్ళు లాయరుగారి దొంగ దెబ్బలు తెలిసినా సహిస్తూ వచ్చాడుగాని ఆయన తనని వాజమ్మకింద జమ కడుతూన్నట్లు పసిగట్టి, పొట్టేలులా పుంజుకొన్నాడు.

"ఏమి కాఫీలోనండీ! దండుగ ఖర్చు' సామెత చెప్పినట్లు, మనందరికీ తాహతు మించిన గుణాలు అబ్బాయి." అన్నాడు సుబ్బారావుగారు.

"కాఫీకే అలా అంటే ఎలాగండి? ఆ మాత్రం తాహతూ లేదనుకుంటే ఈ తాపత్రయా లెందు కంట?''

"దొరికింది ఛాన్సు'' అనుకున్నాడు సుబ్బారావుగారు. అనుకుని వాడికి ఉపక్రమించాడు.

"ఏమి టండీ సార్, మన తాహతు ఏమిటంట? అసలు మన తలిదండ్రులకే పొరబాటున కాస్త దూరదృష్టి ఉండబట్టి ఏవో నాలుగక్షరమ్ముక్కలు నేర్పించారు. సరిపోయింది. ఇవాళ కాఫీ తాగుతున్నాం. లేకపోతే ఈనాడు మనం జెటకాబండి తోలుకు బతకాల్సినవాళ్ళమేగా... అహఁ సంగతి చెబుతున్నా, ఔనంటారా కాదంటారా?'' అన్నారు సుబ్బారావుగారు ధాటీగా. దెబ్బకి చచ్చాడు అనుకున్నా డాయన కుర్రాడి ఆనందంతో.

"ఖచ్చితంగా కాదంటా నండి. మీ వాళ్ళ సంగతేమో నాకు తెలీదుగాని, మా పెద్దలికి దూరదృష్టి లేకపోవడం ఎన్నడూ జరగదు. ఒకవేళ వాళ్ళకి అదృష్టి లేక, నే నివాళ జెటకా తోలుకోవలసివచ్చినా అందుకేం దిగులు పడను. ఝూంమని జెటకా తోలుకు బతుకుతాను. ఔనంటారా కాదంటారా'' అన్నారు రామనాధంగారు.

"నాన్నోయ్! కాఫీ చల్లారిపోతుంది. తొరగా రా'' అంది తలుపవతలే ఉన్న సీత.

"వచ్చేనమ్మా వచ్చే'' అని పరుగెత్తుకెళ్ళిపోయాడు, జవాబు తోచని సుబ్బారావుగారు.

* * *

"నువ్వు గొప్ప రాజకీయ నాయకుడివీ, పెద్ద మినిష్టరువీ అవబోతున్నావు" అని మర్నాడు ఓ జ్యోతిష్కుడు (ముందుగాతెచ్చి ఉంచుకున్న) ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పేవరకు ఆయన కోలుకో లేదు. ఆ తరువాత దినపత్రిక కొని చదివేసేవరకూ ఊరుకోలేదు. చదివేశాక అంతకన్న ఊరుకోలేదు. రామనాథంగారిని ఊదరగొట్టేశాడు.

"పేపరు చదవడం చాలా అవసరమండీ" అన్నాడు, ఆయన్ని మరమ్మత్తు చేసే సత్సంకల్పంతో.

"మీరీ యింట దిగినప్పటినించి ఆ ముక్కే నేను చెబుతూ వచ్చానుగదా! ఇన్నాళ్లకి గుర్తించారన్నమాట!" అన్నారు రామనాథంగారు నవ్వుతూ.

సుబ్బారావుగారు బిక్కమొహం పెట్టబోతూ ఉండగా "నాన్నా, ఒక్కసారిలారా" అని గావుకేక పెట్టింది సీత.

"నా తల్లే, మా ఇందిరే" అని మురిసిపోతూ పారిపోయారు సుబ్బారావుగారు.

"ఏమండోయ్ బావగారూ, కేసు పోయిందనను లెండిగాని, ఇందిరెవరూ? మీ పిల్లపేరు సీతగామా" అన్నారు రామనాథంగారు.

సుబ్బారావుగారు జవహర్‌లాల్‌నెహ్రూ అంత ఎత్తుసాగి, అక్కణ్ణించి రామనాథంగారిని 'క్రేన్‌షాట్ వ్యూ'లో చూసి, మందహాసం చేసి, మాట్లాడకుండా వెళ్ళిపోయారు; తరువాయికథ తెరమీద చూడండన్న తరహాలో.

నిజానికాయన అంతవాడూ కావడం ఖరారని ఢంకా పట్టుకొచ్చిన జ్యోతిష్కుడు దానిమీద అదేపనిగా బాదుతూ చెప్పాడు.

పోలికలు కూడా బోలెడున్నాయన్నాడు జవహర్‌లాల్‌కి తోడుసీడ కుమార్తె ఇందిర ఒకర్తే. సుబ్బారావుగారికి సీత.... కేవలం అదొక్కటే కారణంగా, ఈయన అమాంతం రేపొద్దునేపై మినిష్టరు రాష్ట్రంలో అవుతాడుట. అలా అవాలని ఆయనచెప్పాడు.

"ఎక్కడో అక్కడ ఎలాగో అలా ఓసారి మినిష్టరు అయి

ఊరుకోండి. ఇంక ఫరవాలేదు. ఎన్ ఎ మినిస్టర్—'' అని జ్యోతిష్కుడు అనే సరికి.

''ఆల్వేజ్ ఎ మినిష్టర్'' అని సుబ్బారావుగారు అందుకున్నారు శకీమని.

పరీక్షితుడైన జ్యోతిష్కుడి శిష్యుడు, సకాలంలో తుమ్మాడు.

సుబ్బారావుగారే తక్షణం జయం అన్నారు.

''మీరు ఇవాళ్టినుంచీ పేపరుకి చందాకట్టేసి రాజకీయాల గుట్టూ మట్టూ ఆకట్టుకోండి. ఈలోగా, అంతర్జాతీయ సమస్యలు—ప్రపంచ శాంతి లాంటివి—తేలికైనవి నాలుగైదు ఏరుకొని వాటి పరిష్కారానికి ప్లానులు ఆలోచించండి'' అని నూరిపోసి, నూరు తీసుకు చక్కాపోయాడు జ్యోతిష్కుడు.

సుబ్బారావుగారు సమస్యల జాబితా ఓటి తయారుచేసి అట్టే పెట్టుకొని ఓరోజు పొద్దుటే హైదరాబాద్ బయల్దేరారు.

''అన్నట్లు మేష్టారూ, మీ జీతాలు పెంచే సమస్య ఓటుంది గదూ! అక్కడికెళ్తూనే చూస్తా లెండి'' అన్నారు ఉద్ధరించే ఏర్పాటులో దర్జాగా.

''చిత్తం. మా సమస్య హైదరాబాదులో లేదండి. ఇందంబటే, మేష్టర్ల ఇళ్ళలో ఉంటోంది. ఏదో తీర్మానం గట్రా చేస్తున్నాం లెండి'' అన్నారు రామనాధంగారు నవ్వుతూ.

''అమ్మచెల్లమ్మ! అలాటి పిచ్చిపనులేం తొందరపడి చెయ్యకండి. వాళ్ళు పుసుక్కుని లేదనేస్తారు. ఏదో నాలాటి వాడెళ్ళి నిల్దీసి గట్టిగా కనుక్కోవాలిగాని....కనుక్కోవడం ఏముంది, మినిష్టరంటూ అవుతూనే—''

''ఎంతమాట! ఎంతమంది మినిష్టర్లు కాందే మా కష్టాలు గట్టెక్కేను. మా సంఘంలో చెబుతా లెండి. 'సుబ్బారావుగారు మంత్రి అయేదాకా మా జీతాలు పెంచొద్దు. వీలైతే తగ్గించండి'అన్న తీర్మానం చేస్తాం. మీ ముద్దు చెల్లుగాత. శుభం, వెళ్ళిరండి.''

''మళ్ళీ ఇప్పట్లో రావడం పడదేమోనండి. అట్నించలా ఢిల్లీ వెళ్ళొచ్చు. పేపర్లో చూస్తారుగా. నా భోగట్టా తెలుస్తూనే ఉంటుంది.''

"ఏమిటీ! మీరు పేపరుకూడా పెట్టిస్తున్నా రన్నమాట పేష్" అన్నారు రామనాథంగారు.

రైలు ఓ మైలుదూరం వెళ్ళాక రామనాథంగారి మాటల్లో హేళన బోధపడింది సుబ్బారావుగారికి

"హారి నీ!....ఇందుకే నాకు మంట. చూస్తాగా, మీ జీతాలెలా పెరుగుతాయో!" అన్నాడు కిటికీలోంచి బయటకు కసిగా చూస్తూ

* * *

... దేశసేవ చేసితీరతానని సుబ్బారావుగారు ఎంత పట్టుపట్టినా కుదిరింది కాదు. కావలిస్తే దేశమధ్యంలోనే ఉండి కావల్సినంత సేవ చెయ్యండిగాని, ఇక్కడ్నుంచి చెయ్యటానికి వీలుపడదని చెప్పారు అక్కడివారు. ఉన్న మినిస్టర్లకే ఇళ్ళు దొరక్క ఇబ్బందిపడుతున్నా రన్నారొకాయన.

"ఆ. దాందేముందండి? మనం ఇక్కడ ఉంటామా పెడతామా? ఊహూ టూరుచేస్తూ ఉండడమేగా! ఊళ్ళో ఉన్న రెండ్రోజులూ కావలిస్తే హోటేల్లో ఉంటాం లెండి" అని చూశారు సుబ్బారావుగారు.

"నీకు మరీ మతిపోతోంది నాన్నా. వాళ్ళంతా వేళాకోళం చేస్తున్నారు. అదీగాక ఎలెక్షన్‌లో గెలిస్తేగాని మినిస్టరుగిరీ ఇవ్వరు" అంది సీత.

"అమ్మడూ, నీకు తెలీదూరుకో" అని కోప్పడ్డాడు సుబ్బారావు గారు.

అలా ఎలెక్షనుకి నిలబడనివాళ్ళని ఇదివరకు నామినేటెడ్ మినిష్టర్లుగా నిలబెట్టిన సందర్భాలూ, వివరాలూ ఆయన కంఠతా పట్టాడు. అవన్నీ కలిసిరాకపోతే, చివరికి ఎలెక్షనుకే నిలబడతాన అన్నాడు.

'దర్జాగా నిలబడండి' అన్నారుగాని దగ్గర్లో ఎలెక్షన్‌లు ఏవీ లేవాయె.

చివరికి విసుగెత్తి దేశసేవని ఐదేళ్ళు వాయిదా వేసుకొని తిరుపటపాలో ఇంటి కొచ్చేశాడు సుబ్బారావుగారు సుతా సమేతుడై.

*        *        *

"పోనీ, కనీసం డిప్యూటీ దేశసేవన్నా చేస్తాననక పోయారూ- ఆర్నెల్లణిచ్చినా చా లనకపోయారూ" అన్నాడు రామనాథంగారు మర్నాడు ఉదయం సానుభూతి నభినయిస్తూ.

"ఆర్నెల్లు కాదు, ఆరు ఘడియలు కూడా—" అంటూ హఠాత్తుగా ఆగిపోయాడు సుబ్బారావుగారు. మూడు రోజులనాడు తను దేశసేవకోసం హైద్రాబాద్ వెళ్తున్నప్పుడు రామనాథంగారు హేళన చేశాడన్న విషయం చటుక్కుని జ్ఞాపకం, అందుకని కోపం, వచ్చాయి.

"ఇదుగో - ఏవండోయ్, మీ రేమనుకుంటున్నారో ఏమిటో గాని మా పిల్లదాన్ని మీ గురునాథానికి చస్తే ఇవ్వను, అఁ" అన్నాడు.

"మేం ఎప్పుడూ అడిగినట్టు గుర్తులేదే" అని తడుము కోకుండా జవాబు విసిరిన రామనాథంగారు క్షణం తరవాత నాలిక్కరచు కున్నాడు - ఎంతపనై పోయిందీ అని. సుబ్బారావుగారి మనసులో ఇలాంటి సదభిప్రాయం ఉన్నట్లు ఆయన కలలో కూడా అనుకోలేదు. గురునాథరావు సీతవంక గుడ్లు తేలవేసి చూడ్డం గమనించిన సమయాలలో మటుకు ఆయనకి రెండుమూడుసార్లు ఆ ఊహ తోచింది. సుబ్బారావుగారికి మనసులో అలాంటి సంకల్పం ఉందన్న మాట. ఇప్పు డాయన కోపంలో ఇంత చక్కగా దాన్ని ప్రకటించాడు. "ఏం లాభం!"

అప్పటికే, అవతల గదిలోంచి ఈ సంభాషణ వింటున్న గురునాథరావు గుండె గుభేలు మంది. అని, ఓసారి ఆగింది. ఆ తరువాత పని చెయ్యడమో, ఆగిపోవడమో తేల్చుకోలేక తటపటా యించింది.

'ఏల బ్రతుకేల' అనే విషాదగీతం పాడవచ్చునని యజమానికి

సూచించింది. కాని గురునాథరావుకి అలాటి పిచ్చివేషాలు గిట్టవు సీతకి నచ్చవని భయం.

అనుకోకుండా పెద్దలాడుకున్న సరసం కాస్తా ఇలా బెడిసి కొట్టింది. ఆ దెబ్బ తిన్నది పిన్నలు.

సుబ్బారావుగారు తిక్క కోపంకొద్దీ గబగబా వాకబు చేసేసి, మునిసిపల్ ఛైర్మన్ అయితీరాలనుకుంటున్న ఒకానొక గణపతి రావుగారిని వరించి, వారి కుమారుడికి సీత నివ్వ నిశ్చయించారు. అంతకు ముందింకో ఇంజనీరు వినాయకరావుగార్ని చూసి ముచ్చటపడి సంబంధం ఖాయపరచబోయారు గాని, వారికి కుమారులు లేని పైనం ఆఖరు క్షణంలో తెలిసి విరమించారు.

తెలుగు సినిమాకథ చివరి భాగంలాగా, ఆయన ప్రయత్నాలూ నిర్ణయాలూ, కార్యాలూ హడావుడిగా జరిగిపోయాయి. వారూ వీరూ చూసుకున్నారు. ముహూర్తాలూ పెట్టేసుకున్నారు.

ఇలాటివి గురునాధరావు ఖాతరు చెయ్యడుగాని, సీత పద్ధతి చూడడంతో అతనికి మతి పోయింది. చూడవచ్చిన పెళ్ళికొడుకు లందరికీ వంకలు పెట్టి వచ్చిన దారినే పంపించేస్తుందనీ, ఈలోగా తను బియ్యే పాసై ఉద్యోగం సంపాదించి పెళ్ళికి సిద్ధం కావచ్చుననీ **అతని ఆశ.**

కాని సీత అలాటి పనేం చెయ్యలేదు. ఔను అనలేదు, కాదనలేదు

అక్కడితో గురునాథరావుకి సీతమీద ఆశ, జీవితం మీద ఆసక్తి తగ్గిపోయాయి. అశక్తుడి క్రోధం, దాని తరువాయి వాయి అయిన దుఃఖం పెల్లుబికాయి....

....ఉత్తరక్షణాన ఊళ్లో పెద్దల తలకాయలమీద కనబడని రాళ్ళు వర్షించాయి. 'ఏమిటిది!' అని వాళ్ళు ఆశ్చర్యపడ్డారు గాని—

"ఓ ప్రేమకథా! నీదారి సదా అడ్డదిడ్డంగానే సాగిందిగదా. వెనుకటికి లైలామజ్నూ, దరిమిలానో ఆ వెనుకో రోమియో జూలియట్, ఇపుడు సీతా నేనూ... నాన్నలూ, మామయ్యలూ, సంఘం దళసరి గోడలూ ప్రేమికులని ఎంతో బాధ పెడుతున్నాయి

గదా!'' అంటూ గురునాథరావు షుభితహృదయం విసరిన శాపనా ర్థాంతరన్యాసాలే అలా రాళ్ళయి నెత్తిన పడుతున్నాయని వాళ్ళు పసిగట్టలేక పోయూరు. ఒకరిద్దరికి తెలిసినా, ఆ ముక్క పైకి అంటే లాయరు సుబ్బారావుగారికి కోపం వస్తుంది, బాగుండదని, నోరు మూసు కూరుకున్నారు.

అలా కోపంగా శాపనార్థాలు గుప్పించడం అయిపోయిన తరువాత గురునాథరావుకి దుఃఖం, ఈ లోకంలో తక్షణం తన జీవితం 'అభావం' అయిపోవాలన్న సంకల్పం మరింత ఎక్కువ అయ్యాయి. ఈ స్థితిలో ఒంటరిగా ఉండడం మంచిదికాదని తోచి, మర్నాడు పొద్దుటే లేచి, తుకారాముణ్ణి వెతుక్కుంటూ బయల్దేరాడు. తుకారాం ఇప్పుడు రోడ్లవెంట తిరగటంలేదనీ, తుకారాం న్యూస్ సర్వీస్ ఆఫీస్‌లోనే కూర్చుంటున్నాడనీ తెలిసింది.

వెళ్ళగానే కెలిపతిరావు ఎదురయ్యాడు

''హల్లో గుడ్‌మార్నింగ్, మీరు ఆత్మహత్య చేసుకోవాలను కుంటున్నారుగదూ. రైటే' నాకూ-డా మార్గాంతరం తోచలేదు. కానివ్వండి. విషయాలకు మంచి హెడ్డింగుపెట్టి మెడ్రాసు పంపిస్తాను. 'ప్రముఖ ప్రేమికుడి ప్రపంచాంతర ప్రయాణం' అని అన్నాడు కెలిపతిరావు.

గురునాథరావుకి చిరాకేసింది.

''నీ కెలిపతిమండ'' అని విసుక్కున్నాడు.

''మరేండి, నాపేరే కెలిపతిరావు. ఆ వేళ రాత్రి వచ్చింది నేనేనండి....అరె, అలా కోపంగా చూస్తారేం? కొడతారా ఏమిటి కొంపతీసి'' అంటూ అర్జెంటుగా పక్క గదిలోకెళ్ళి తలుపేసు కున్నాడు కెలిపతిరావు.

* * *

గురునాథరావు విచారంగా ఇంటి కెళ్ళి తన డైరీ తీసి సీత కథను చదువుకుంటూ కూర్చున్నాడు. క్రితంరోజు సాయంత్రం వరకూ జరిగిన సంఘటనలన్నీ చదివి ఆగాడు.

ఈ కథని ఎవరేనా సినిమాతీస్తే ఈ ఘట్టంలో హీరోచేత

ఒకసారి నిట్టూర్పించి, డ్యూయెట్ మొదలెట్టించి, తొలి చరణం కాగానే, పక్కవాటాలో ఉండే హీరోయిన్ దగ్గిరికి కెమెరాని పాన్ చేయిస్తారు. ఇక్క దొచ్చే చిక్కేమిటంటే సీతకి పాటరాదు. అయితే పాన్‌చేసిన కెమెరాని కొంచెం అపింటా జరిపితే అక్కడ, మంత్రి పదవి లభించలేదని మధనపడుతున్న లాయరు సుబ్బారావుగారు దొరుకుతారు. ఆయనా మంత్రిగిరి తప్ప మరోటి గిట్టని ఏకలవ్యుడే కాబట్టి, ఈ ఘట్టంలో ఈ ఏకలవ్యద్వయంమీద డ్యూయెట్ చిత్రించ వచ్చు. మంత్రిగిరికి సిద్ధపడ్డాడు గాబట్టి పాటవచ్చినా మానినా పాడిందికి వెనకాడ డాయన.

'సరే' ఒటువుగా నిట్టూరుర్చబోయాడు గురునాధం. కాని ఆ పనిని అరక్షణంలో ఇంకెవరో చేసిపెట్టారు.

''ఆశ్చర్యపడకు నేనేలే'' అన్నాడు తుకారాం.

''దానికీ ఓపిక లేదు.'' అన్నాడు గురునాథరావు, వెనక్కి తిరిగి చూడకుండానే.

''మరేం ఫరవా లేదు. అదే వస్తుంది. సీతకి గణపతి రాయుడుగారి సంబంధం ఖరా రైనందువల్ల, నీకా పిల్ల లభించడం కల్ల. గ్యారంటీ ఇస్తున్నాను... నేను తుకారాం న్యూస్ సర్వీస్ మానేసి తుకారాం గ్యారంటీ సర్వీసు పెట్టానులే,'' అన్నాడు తుకారాం నవ్వుతూ.

మతిపోయి ఏడుస్తున్నవాడికి, శ్రుతిచూసి మరీ కానిమ్మని యతి ప్రాసాదియుతమైన వాక్యంలో సలహా లివ్వటం, చూచే వాళ్ళకు సరదాగా ఉంటుండిగాని, ఆ స్థితిలో ఉన్న గురునాథరావుకు కాదు. అందుకని అతనికి కోపం వచ్చింది. జుట్టు పీకేసుకోబోయి, అంత పనీ చేశాడు. నెప్పెట్టింది. పైగా క్రాపింగు రేగిపోయింది.

''చూశావా! తొందరపాటువలన కలుగు నష్టములు, ఇప్పుడు మళ్ళీ పాపిడితియ్యడం అరగంట పని,'' అన్నాడు తుకారాం బిక్క మొహం పెట్టి, నవ్వడానికి ప్రయత్నిస్తూ.

''కాదు. ఐదునిముషాల పని,'' అని గురునాథరావు చివాలున

లేచి, చరచర సెలూను కెళ్ళి తిక్క కోపంలో గుండు చేయించు కొచ్చేశాడు.

రాగానే రామనాథంగారు, ఆయన భార్యకూడా మండిపడ్డారు గురునాథం గుండు చూసి. "మేం ఇద్దరం పోయామనుకున్నావా" అన్నారు.

గురునాథం దిగాలు పడిపోయాడు. ఆ పోవడం పోవడం అలాగే మంచివారిన పడిపోయి దారుణమైన శ్రద్ధతో పుస్తకాలు చదివెయ్యడం మొదలెట్టాడు. కొద్ది రోజుల్లోనే క్లాసులో వెనక బెంచీల వాళ్ళంతా అతన్ని వెలేసి ముందరకి నెట్టేశారు. అందరూ అలా తరిమికొట్టేసరికి గురునాథం చివరికి ముందు బెంచీల మంచి విద్యార్థుల్లో కలిసిపోయి వాళ్ళని మించిపోయాడు. "ప్రతి టెస్టులోను అతనే ఫస్టు" అని అందరూ ముక్కున వేలేసుకు చెప్పుకో సాగారు.

"ఓడలు బండ్లవును" అని చెప్పుకు వాపోయారు వెనక బెంచీలవాళ్ళు.

లెక్చరర్లంతా కలిసి గ్రీవాలు కలవకపోయినా కాస్త అటూ ఇటూగా ముక్తకంఠంతోనే "బ్రిలియంట్ స్టూడెంట్" (అనగా ప్రకాశించే విద్యార్థి) అనేశారు పుసుక్కున.

ఇంకేముంది, అక్కడితో గురునాథరావు ఉహూ ప్రకాశించి పోవడం మొదలెట్టాడు అతని గురించి కట్టుకథలు ప్రచారంలో కొచ్చాయి.

"వాళ్ళింట్లో రాత్రిళ్ళు దీపాలు వెలిగించడం మానేశారట తెలుసా.... అతను చీకట్లో పుస్తకం చదివెయ్యగలడటమామూలుగా.... మరి ఆ ముఖద్యుతి అంతా అందు మీదే పడుతుందిగదా ..." అని చెప్పుకొన్నారు కథలు కొందరు.

తుకారాం ఒక కథ అల్లేశాడు. "ఒకరోజు రాత్రి ఓ కుర్రాడు లైటు లేకుండా సైకిలు తొక్కడం పోలీసు చూశాడు. వాణ్ణి ఆపి అడిగేలోగా ఆ వీధి అంతా కళ్ళు మిరుమిట్లు గొలిపేకాంతితో నిండి పోయింది. పోలీసువాడు ఇది పగలు కాబోలు అనుకుని, నాలిక్కరచు

కొని వెళ్ళిపోయాడు. కాని అంతలోకే మళ్ళీ ఓకట్లు కమ్మాయి కారణం!

గురునాథరావు ఆ రాత్రి ఇంటి కెళ్తూ ఆ వీధిలోంచి ఓ సందులోకి మళ్ళేను. ఆ కాస్సేపూ అతని కాంతితో ఆ రాత్రి పట్ట పగలన్న భ్రమ కలిగించెను....

• • •

ఇలా విపరీతమైన ఉపాఖ్యానాలతో గురునాథరావు ప్రఖ్యాతి విస్తరించింది. అక్కడినించి ఆడపిల్లల్ని కనుకున్న తలితండ్రులు తమపిల్లనంటే తమ పిల్లని చేసుకోమంటూ గురునాథం తండ్రిని బ్రతిమాల సాగారు. కట్నాలు ఎంతైనా ఇస్తామన్నారు.

కాని గురునాథరావు ఏ ఒక్క పిల్లనీ కన్నెత్తి చూడలేదు. పన్నెత్తి పలకరించలేదు. అక్కడితో అతని గిరాకి మరింత పెరిగింది. అంతా ఆశ్చర్యపడిపోయారు. ఎంత ప్రేమైనా మరీ ఇంత ప్రేమా అని విస్తుపోయారు, గురునాథరావు 'ఏకలవ్యు' దని తెలిసిన వాళ్ళు.

తుకారాం ఓరోజు పొద్దున్నే గ్యారంటీ సర్వీసులో పెళ్ళిళ్ళ బ్యూరో' శాఖ పెట్టానన్నాడు. అని, పదిమంది ఫోటోలు పట్టు కొచ్చేసి చూపించాడు.

"అబ్బీ' ఈ పిల్లని చూడు ఇంజనీరు. ఆస్తి పదెకరాలు మేడ, కారు. ఈ బొమ్మ చూడు గవర్నమెంటుసర్జను. రెండు కార్లు. పోనీ ఇది చూడు పెద్ద బిజినెస్‌మాను. ఏకబిగిని పదిమంది ఆడపిల్లలికి పెళ్ళిచేసే ఆస్తి రెండు కార్లూ, రెండే కూతుళ్లూ ఉన్నాయి. ఇది రెండోది."

గురునాథం విసుక్కున్నాడు. "ఇంజనీరుల్నీ, డాక్టర్లనీ నే నెక్కడ చేసుకోనురా? బియ్యే కూడా కాను అయినా కాకపోయినా సీతని తప్ప ఇంకోళ్ళని చేసుకోను" అన్నాడు.

తుకారాం జాలిపడ్డాడు. "ఇంజనీరూ, డాక్టరూ చేసున్నది అమ్మాయిలు కాదు వాళ్ళ నాన్నలు. వాళ్ళ ప్రభ పైనం చెబుతున్నా, అదేముఖ్యం అనుకున్నా. ఒక్కొక్కడూ ఓ డజనేసి అల్లుళ్ళకి జోడొందల ఉద్యోగా లిప్పించగలడు. ఇదిగో ఈ చివరి బిజినెస్

ఆయన్ని, అదే. ఆయన కూతుర్ని చేసుకుంటే, ఇంకో లాభం ఉంది. నావుపాటి బావమరిది దొరుకుతాడు. ఎవడ్నైనా తన్ని రమ్మంటే ఇట్టే చితగ్గొట్టి చక్కా వస్తాడు.''

''గెటౌట్'' అన్నాడు గురునాథం.

''దానికేం మా భాగ్యం కాని, ఈ బొమ్మలుగల పన్నెండు మంది పెద్దలికీ కూడా మా తుకారాం గ్యారంటీ సర్వీసువారు గ్యారంటీలు రాసిచ్చేశారుగదా-తప్పక నిన్నొప్పించ గలమని! ఇందులో ఏ ఒక్కర్ని నువ్వు కాదన్నా సరే, మా ఆఫీసుకి పేరు పోతుంది.''

''షటప్'' అన్నాడు గురునాథం ఉక్రోషంతో.

''అయితే, నీ విషాదగాథ ఎన్నాళ్ళు సాగేట్టు.'' అన్నాడు తుకారాం చిన్నబుచ్చుకుని.

గురునాథరావు కోపం దిగమింగి కష్టం మీద చిరునవ్వు ప్రయత్నించాడు. ''శిష్యా, ఇది అనంతం.''

''నాన్సెన్స్! వల్ల కాదు నీ కథకి చప్పున పుల్‌స్టాపు పెట్టిం చేసి, అది కాస్తా రాసేసి, దాంతో తుకారాం స్టోరీ సిండికేటు ప్రారంభిస్తాం, కాసుకో''-చక్కాపోయాడు తుకారాం.

* * *

గురునాథరావు తండ్రి రామనాథంగారికి ఒళ్ళుమండిపోయింది కొడుకు వరస చూసి. 'ఏదో ఓ సంబంధం ఖాయపరిచి తీరాల్సిందే' అన్నాడు కారాలు నూరుతూ

గురునాథరావు అప్పటికి పిల్లి అయిపోయి తన గదిలోకెళ్ళి తల్లిద్వారా తండ్రికి మెల్లిగా తన ఊహ చెప్పించాడు.

'కల్ల'' అన్నారు రామనాథంగారు, గంభీరంగా కిటికీ అవతలికి చూస్తూ.

''అదే బావుందండీ! ఇదేం సినిమా అనుకున్నారుటండీ, అలా ఒక్కముక్కలో తేల్చేసి, అటెటో చూస్తారు? నూరేళ్ళ బతుకు, కుర్రవెధవ భయపడుతున్నాడు! పిల్చి కనుక్కోండి సరిగ్గా'' అందావిడ.

పిల్చి కనుక్కున్నాడు రామనాథంగారు

సిగ్గుపడుతూ 'ఔను!' అన్నాడు గురునాథం.

"మరి సీతకి ఇష్టమేనా?" అన్నాడు తండ్రి.

గురునాథం చాలాసేపు జవాబు యివ్వలేదు. ఆనక తల్లి వంక చూసి, తల వంచుకుని, 'తెలీదు' అన్నాడు మెల్లిగా.

రామనాథంగారు పగలబడినవ్వారు. "ఏమి ప్రయోజకుడివిరా నా తండ్రీ!" అంటూ.

"నా వెర్రినాన్నా! ఎలా బ్రతుకుతావురా నోట నాలుకలేనివాడివి!" అని ఊహూం ఇద్దై పోయింది వాళ్ళమ్మ.

"అదే, ఆ సీతే తగును వీడికి. ఇన్నాళ్ళు ఆ తిక్కముండా తండ్రిని పెంచుకొస్తోంది గదా, ఇంక ఈ వెర్రిబాగుల మొగుణ్ణి కూడా సాకుతుంది. ఆ సుబ్బారావుగారు ఏమంటాడో చూడాలి మరి.'

"సీత కిష్టమే లెండి ఒకటి రెండుసార్లు కదలేసి చూశాను" అందాయన భార్య.

గురునాథం బుర్ర గిర్రున తిరిగిపోయింది. సిగ్గుపడుతూ గదిలోకి పరుగెత్తి "హాయిగా-హా" అనే పాట పాడబోయి వరసకుదరక మానేశాడు.

"జడ్డి వెధవ" అన్నాడు రామనాథంగారు నవ్వుకుంటూ.

● ● ●

ఆయన బళ్ళో కెళ్ళబోతూ ఉండగా తుకారాం రివ్వున పరిగెత్తు కొచ్చాడు.

"నమస్కారం అండి. నా పేరు తుకారాం, నేను గురువులు ఫ్రెండుని" అన్నాడు వినయంగా.

"గురువు లెవడోయ్!" అన్నాడు రామనాథంగారు చిరాగ్గా.

"అదే మీ అబ్బాయండి. ఐ మీన్ గురునాథం."

"ఏమి టా మీనూ మానూను. ఏం చదువుకున్నావు నువ్వు? ఒక్క వాక్యం సరిగ్గా మాట్లాడ లేక పోతున్నావు. ఏం సంగతి?" అన్నాడు రామనాథంగారు.

"మీరు కొంచెం గణపతిరావుగారింటికి రావాలండి. అక్కడ

మీ సుబ్బారావుగారూ, గణపతిరావుగారూ పోట్లాడు కుంటున్నారు. మిమ్మల్ని తే కేసుకు రమ్మన్నారండి....! అస లేమి టంటే___''

రామనాథంగారు సరాసరి గణపతిగారింటికి చర చర వెళ్ళాడు. తుకారాం వెనకాలే వెళ్ళాడు.

''ఊఁ, ఏమిటి దెబ్బలాట?'' అన్నాడు రామనాథంగారు దారిలో.

''మరి నరసన్న గారొచ్చారు గదండీ మెద్రాసునుంచి?''

''ఆయ నెవరు!''

''ఆయనా? డోళ్ళ వర్తకు డనుకుంటా నండి.''

''ఏమిటి? డోళ్ళా?''

''మరేండి, డోళ్ళు. పెళ్ళికి వాయిస్తారూ? అవీ. ఆయన అస్తమానం డొక్క చీల్చి డోలుకడతా నంటాడుగా. అలా చేస్తాడు. ఆయనే. మరి అలా కట్టిన డోళ్ళు అమ్ముకుంటాడని నా అభిప్రాయం.''

''నీ అభిప్రాయా లొదిలేసి సంగతి చెప్పవోయ్'' అన్నారు రామనాథంగారు.

'అదేమిటండీ! నాకూ రాజకీయాలు తెలుసు నేనూ పొలిటికల్ వాణ్ణే!''

''అందుకే....సర్లే. తరువాత?''

తరువాతే కథ అడ్డం తిరిగింది. నరసన్న గా రొచ్చే వరకూ గణపతిరావుగారూ, సుబ్బారావుగారూ ఇల పాటిలేని నేస్తాల్లా మునిసిపల్ ఎలెక్షనుకు సన్నాహాలు చేస్తున్నారు. చైర్మనుగిరీకి పోటీ చేస్తున్న రెండో ఆసామి కట్టుదిట్టంగా 'ధనర్థారి'యై ఎన్ని కల సమర రంగంలో దిగాడని తెలిసి గణపతిరావుగారు కాస్త బెదిరారు. ఎందు కేనా మంచిదని మెద్రాసునుంచి నరసన్నగారిని పిలిపించారు. ఆయన ఎసెంబ్లీకి పోటీచేసి ఓడిన వ్యక్తి. గెలిచి ఉంటే మినిష్టరై పోయే వాడు. అందుకని ఆయన చెబితే జనం వింటారని గణపతిగారు ఆశపడి రమ్మన్నారు.

తీరా నరసన్నగారొచ్చాక ఆయనతో సుబ్బారావుగారికి జోస్తీ ఎక్కువై పోయింది.

ఆ నరసన్నగారు అవబోయిన మినిస్టరు, తనేమో అవబోయే మినిస్టరు. ఎలాగేనా ఇద్దరూ ఒక ఛాయావాళ్ళవుతారు. ఆ ముక్క నరసన్నగారే అన్నాడు.

సుబ్బారావుగారు పొంగిపోయారు.

ఈ 'మినిష్టర్ల' సరసాలకి గణపతిరావు తట్టుకోలేక పోతున్నాడు.

బియ్యేపరీక్ష తప్పినవాడి దృష్టిలో స్కూలుపైనలు పరీక్షలంత లోకువగా కనబడింది, నరసన్నగారి కీ మునిసిపల్ ఎలక్షను.

"ఇదీ ఓ ఎన్నికేనా! ఈపాటిదానికి సాయాలూ ప్రచారాలు ఎందుకూ? నేనో చిన్న చీటీ రాస్తాను, దాన్ని అచ్చుకొట్టించి పంచి పెట్టిస్తే చాలు" అన్నాడాయన.

"మరే. ఇంతోటి ఎలక్షనుకీ అంతకన్న ఖర్చు దండుగ" అన్నాడు సుబ్బారావుగారు హుషారుగా.

గణపతిగారికి ఒళ్ళు మండిపోయింది, "ఏమిటండీ మీహేళన, ఒళ్ళూలా. నిన్నటినుంచి మిడిసిపడిపోతున్నారు. చావ ఉంటే గెలవండి చూద్దాం. లోకువగా మాటాడినట్టుకాదు" అన్నాడు విసురుగా.

సుబ్బారావుగారు తెల్లబోయి నిర్లిప్తంగా నవ్వుతూ నరసన్న గారివంక చూశాడు

ఆయన పేపరులో దాక్కుని తెగ చదివేస్తున్నాడు.

"ఆయనవంక చూస్తారెందుకు' ఆయనా ఓరాయి విసుర్తాడనా? విసిర్నా ఆయనకైతే చెల్లింది. చెల్లినా అలా విసరడు. ఆయన మిత్రుడు, మీరు కాబోయిన బంధువులు. అదే తేడా" అన్నాడు గణపతిగారు.

కథ ఈ ఘట్టంలో ఉండగా చూడవచ్చిన తుకారాం అదను చూచి "సుబ్బారావుగారు దేవుడంటి మనిషండి, ఆయన్ని

